స్థాపితము 1935 జనవరి.

# సాహిత్యలత

## గ్రంథమాల,

## ఓరాల.

మధురములగు పద్యకావ్యములు మంచి మంచి నాటకములు సాటిలేని నవలలు ప్రచురింపబడుచుండును.

చందా

ప్రవేశరుసుముతో సహా

సం॥ 1 కి రు 8—8—0

అభిమానులు

సం॥ 1కి రు 5—0—0

పోషకులు

సం॥ 1కి రు 10—0—0

రాజపోషకులు

సం॥ 1కి రు 20—0—0

# సాహిత్యలత పోషకులు.

మ. రా. రా. శ్రీ శ్రీకాకుళం పట్టాభిరాములు గుప్తగారు.

,, వ్యాటుకూరి రామయ్య శ్రేష్ఠిగారు.

,, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు.

,, గరికపర్తి నాగభూషణదేవరగారు,

సబ్ రిజిష్ట్రారు.

,, పేటేటి వెంకటాద్రినాయుడుగారు.

,, నాయని నరసింహారావునాయుడుగారు,

ప్లీడరు ఒంగోలు.

,, డాక్టరు, గింజాం రాఘవాచార్యులుగారు,

M. B. B. S. ఒంగోలు.

,, మున్షి సయ్యద్ జాఫరుసాహేబు బహదూర్,

టుబాకో మర్చంటు, ప్రెసిడెంటు పంచాయితీబోర్డు [illegible].

,, ఘంటా గోపాలకృష్ణయ్య చౌదరిగారు.

పంచాయితీబోర్డు ప్రెసిడెంటు పరుచూరు.

,, కొల్లా బుచ్చయ్య చౌదరిగారు.

టుబాకో మర్చంటు.

,, శృంగవరపు అంజయ్యగారు.

కంట్రాక్టరు పరుచూరు.

,, దగ్గుపాటి పాపయ్య చౌదరిగారు,

భూస్వామి కారంచేడు.

మ. రా. రా శ్రీ పాటిబండ్ల శ్రీమన్నారాయణ చౌదరిగారు,

ప్రెసిడెంటు పంచాయితీబోర్డు భీమవరము.

„ దొప్పలపూడి వీరయ్య చౌదరిగారు,

ప్రెసిడెంటు పంచాయితీబోర్డు పోతుకట్ల.

„ చల్లా రెడ్డయ్య గుప్తగారు,

కంట్రాక్టరు పేటపాలెము.

„ ఊటుకూరి లక్ష్మీనరసింహాదాసుగారు,

కంట్రాక్టరు పేటపాలెము.

„ రావుబహద్దర్, తుంపూడి భగవత్సామ్ గుప్త

గారు, B. A. B. L. రిటైర్డుకలెక్టరు మద్రాసు.

# కృతిభర్త

---

ఈశ్వర సంవత్సర భాద్రపదబహుళ ద్వాదశినాడు

అశనిపాతమున కీర్తిశేషులైన



పరాంకుశం గోపాలాచార్యులుగారు.

# అంకితము.

ఈశ్వర సం॥ భాద్రపద బహుళద్వాదశీ శుక్రవామునాడు మార్గమధ్యమున నళనిపాతముచే మరణించి కీర్తి శేషుడైన [illegible]తమ్ముడు ఆయుర్వేదవైద్య విశారదుడును [illegible]గోపానకుడును అగు పరాంకుశం గోపాలాచార్యులకు,

# అశ్రువులు.

జీవిత నాటకంబునకు చిత్రముగాచరమాంకకేళి సం
ధివిధిగానొనర్చి జనులెల్లరుభోరనియేడ్వ సర్వసం
భావితకీర్తి నీచిఱుత ప్రాయమునందె గడించుకొన్న నా
పావనమూర్తి! హా! యశనిపాతము సన్మరణించినాడవే!

* * * *

అన్నా! రాముడవీవు లక్ష్మణుడ నేనంచు న్మహాభక్తితో
నెన్నండు న్విడనాడకన్గొలిచినావే! తండ్రి! యానీవు-ని
ర్భిన్నక్రూరత రాశనీహతుడవై భస్మంబవంగా, నినుం
గన్నారంగని జీవముల్విడువలేకంబోతి పాపింగటా॥

* * * *

ఈవు నిజముగ సౌమిత్రివే వలంచు
గాని నేరామచంద్రుడ గాను-కాను
నైచ్యదౌర్బల్యదైన్య మానవుడనొ-క
రాళభీకరదుర్భాగ్య గాత్రుడనొ॥

* * * *

దళమాజీరక మిశ్రసద్గుడముబూతం బాయు-
ర్వేదవాక్కుల బారోపింపుదుము, దానివయి
నిగ్గుతేరు, పారిద్రమంగళ దివ్యాక్షతలుంచి
నీ శిరముదాకంగన్నెడ్గోయి, నీ తల్లక్రిందు గ్గ
ఖిండఘటింపవలసెగా తండ్రీ!! విధి ప్రేరణకా॥

(అశనిపాతము, నుండి.)

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.

పురుషులు.

సూత్రధారుడు.

| | | |
|---|---|---|
| నారదుడు. | ... ... | దేవఋషి. |
| మణికంధరుడు. | ... ... | నారదుని శిష్యుడు. |
| నలకూబరుడు. | ... ... | కుబేరుని కొడుకు. |
| శ్రీకృష్ణుడు | ... ... | ద్వారకా నాధుడు. |
| బలరాముడు. | ... ... | కృష్ణుని అన్న. |
| మణిస్తంభుడు. | ... ... | ఒక సిద్ధుడు. |
| మాయానలకూబరుడు. | | మణికంధరునిమారురూపు. |

యాదవులు వగైరా.

స్త్రీలు.

| | | |
|---|---|---|
| కలభాషిణి. | ... ... | ద్వారకలోని వేశ్య. |
| సరోజని. | ... ... | చెలికత్తె. |
| రంభ. | ... ... | అప్సరస. |
| మాయారంభ | | కలభాషిణియొక్క మారురూపు. |

వ్రాతపూర్వకమగు నాయనుమతిలేనిదే యీనాటకము నెవ్వరుం బ్రదర్శింపగూడదు.

గ్రంధకర్త.

## నాంది.

నీరధి భూమిగా - పుడమి
నీరధిగా _ నణువున్నగంబుగా
భూరినగంబు రేణువుగ_
పూరిబవి ప్రతిమంబుగా - పవిన్
బూరిగ_మంచు నగ్నిగను
భూరిదవాగ్నిహిమంబు సదా
మారుచునుండు దేనిమహిమన్
సుతించెద నట్టి కాలమున్ ॥

# సంపాదకీయము.

సాహిత్యలతకు బూచిన 15 వ కుసుమమీ "కలభాషిణీ" ధనలోపమున సకాలమునకందీయఁజాలకపోతిమి. ఇకముందిట్టి లోపములు రాకుండుటకు తీవ్రముగ బ్రయత్నించుచున్నాము. భారము భగవంతునిది.

ఈ "కలభాషిణి" పింగళి సూరనగారి "కళాపూర్ణోదయము"నుండి గ్రహింపబడినది. సూరనగారి గ్రంథములలో నెల్ల కళాపూర్ణోదయమే ముఖ్యమైనది. సూరనగారు "సకల లక్షణ లక్షితంబైన మహాప్రబంధము కీర్తికారణం" బనితలచి, "అపూర్వకథా సంవిధాన వైచిత్రీ మహనీయంబును, శృంగారరసప్రాయంబును పుణ్యవస్తు వర్ణనాకర్ణనంబును" నగు నొక మహాకావ్యమును రచించెదనని ప్రతిజ్ఞజేసి, కళాపూర్ణోదయమును నిర్మించెను. ఈకావ్యమాంధ్రమున, నద్వితీయమైనదని చెప్పుపదుగురు సహృదయులతో మేమును నేకీభవింతుము. ఉపజ్ఞకును, భావనాశక్తికిని, భాషాశక్తికిని సూరనగారు మేటి—విశాలమగు కథను కల్పించి, పుష్టినొసగి, అన్నిరసములకును స్థానమేర్పరచినాడు. ఈ మహాకవికిగల కల్పనాశక్తి ప్రబంధకవులలో నెవ్వరికినిలేదు. కళాపూర్ణోదయమున భావమునుమించి శైలియు, శైలినిమించి భావమును 'నేను,—నేను' అనిపరువెత్తుచుండు పద్యములనేకములుగలవు. చిత్రవిచిత్రముగ నూతనమార్గమునఁ బ్రోక్కి—, స్వతం

త్రించి, కావ్యనిర్మాణమున, స్వీయశక్తి నిచాటిన మొదటి తెలుగు కవి సూరనగారని మానమ్మకము.

కళాపూర్ణోదయమున "కలభాషిణి" చరిత్ర మరింతరమణీయమైనది. ఇందలికల్పనలు ఇంద్రజాలములు-పద్యములు మధురసుధాధారలు—

అంతటి యుద్గ్రంథమునుండి గైకొని, నరసింహాచార్యులుగారు, కొలదిమార్పులతో కలభాషిణినినాటకరూపమున వ్రాసిరి. ఈ గ్రంథమునకు శోకాంతమందముగ నేయున్నది. ఈ గ్రంథకర్త కళాపూర్ణోదయమునుండి భావములగైకొన్నను, వికారములు జేయక పద్యములు చక్కగ వ్రాసినాడు.

"చలువగల వెన్నెలల చలువునకు సౌరభము" అనులయవి భాతినిజూచి "చలువ చేజాలుచు వెన్నెలకు సౌరభమబ్బి యుండ మాగొంబనందియున్న" అనుపద్యమును అందముగవ్రాసినాడు. (పుట 18) ఇట్లేఅనేము లిందుగలవు. ఈ గ్రంథకర్త సాహిత్యలత పాఠకులకు చిరపరిచితుడగుట, విశేషించివ్రాయుట నవసరము.

కళాపూర్ణోదయమును చదివి యానందింపజాలని తక్కువతరగతి వారనేకులుగలరు. వారికలభాషిణినిజదివి మితిలేనియానంద మనుభవింపగలరని మానమ్మకము. రసికులానందింతురు గాక!

సాహిత్యలత
చీరాల.

కల్లపాలెం కృష్ణరావు,
సంపాదకుడు.

శ్రీ.

# కలభాషిణి.

## ప్రథమాంకము.

(రంగము — ద్వారకానగరమందలి ప్రమదావనము)

(కలభాషిణీ, సరోజిని ప్రవేశించుచున్నారు.)

సరో — చెలీ! ప్రకృతి చిత్రములజూడవలెనన్న వర్షఋతువే ముఖ్యమైనది, చూడుము.

కల — (విసుగుతో) సఖీ! నేడేమియోగాని, నా చిత్తమందొక విధమగు నారాటము [illegible]

సరో — అదేమి సోదరీ? నేడే నీచిత్తమిట్లు కలతపడుటయేమి? నారదఋషి శిష్యసమేతుడై ద్వారకానగరమునకు వచ్చెనట, ఏనాడారంభించినాడో నాటనుండియు నీవేదో యొక తీరుననుండితివని మనసఖులెల్ల గుసగుసలాడుచునే యున్నవారు అన్నట్లు మరచితిని వారు వచ్చునది ఏమునేడెగదా?

కల — చాలు లేవే నీమాటలుగు, నీవును, (కొంచెము కోపము నటించుచు మాటనుమార్చి) అబ్బా! యేమిది దాపున నెక్కడనో వర్షము గురియుచున్నట్లున్నది. వానపై నుండి

వచ్చునీగాలి శరీరమునకు గగుర్పాటు గలిసించుచు బాధిం
పుచున్నది గదా.

సరో—అయ్యో అక్కా అదేమే బాధింపుచున్నదని గాలిపై
నిందవేయుదువు. ఆశీతమారుతపోతము నీకుదర్శరలో
గలుగఁబోవు మనోహరగాఢాశ్లేషసమయజనిత, పుల
కాంకురముల జవిజూపుచున్నది.

మ॥ పదియార్వన్నెపసిండి చాయయును కోపంబందగాజాలి
తాఁగదియన్లేఁజివురాకుకన్న మృదువైగాన్పించు నీమేనియం
దుడయంబైన గగుర్పు జూడసొగసై యొప్పారి
దాదెల్పెడునమ్మదితా! ప్రియుని కౌఁగిటంగలుగు వాపుల్కాంకు రానందముల్॥

కల—నీయధిక ప్రసంగము మేఱమీఱుచున్నది.

సరో—(నవ్వుచు) అక్కా నిజమాడిన నిష్ఠురముగదా?

కల—(కొంచెము నవ్వుతో) కానున్న బాలికలకు మనకేమివిర
హామే?

సరో—కావుననే విరహము—బాలవుగాక నీవు ప్రౌఢవైయున్నచో
నిట్లు కృశించుటయేల?

కల—చేలీ నేను విరహతప్తనని నీవునిజముగ దలచెదవా?

సరో—నేనే యేమి, నిన్నెరిగినవారెల్లను నట్లే దలచుచున్నారు.

కల—(అసూయతో) ఛీ! పాడులోకము.

సరో—ఊరక లోకనింద యేలకొనర్చెదవు? ఇందునీకుమాత్ర
ము తెలియనిదేమున్నది చూడుము.

సీ॥ కెంపువన్నియ నీనుకెమ్మోవి కందంగ
వేడినిట్టూర్పుల విడచుటేల?
పాలుగారెడి నీకపోల భాగంబులు
చిడిముడి కుప్పుట జెందుటేల?
చిరినవ్వులొలుకు సుందర ముఖకమలంబు
యోజఖిన్నత గ్రక్కియుండుటేల?
యుడక చిత్తమ్ములదవిలి దోపిడీనల్ప
జూపులు నేలనే జూచుటేల?
గీ॥ నొక్క మాటాడబోయి వేరొక్క మాట
నుల్కి పడినట్లుగాభీతి బల్కనేల?
తనువు కంపింపనేల? వింతయును గాంచ
విరహవేదన గాదొ, దాపరికమేల?

కల—(ఇంచుక లజ్జామిళితమైన కోపముతో) ఛీ! ధూర్తురాలా! యిక నోరుమూయుము.

సరో—నీ ప్రియలాభము చేత, గాక, నానోరుమూతబడునా?

కల—(విసుగుతో) నాప్రియు డెవరే?

సరో—అదే నాకు, నేనడుగునది గూడ.

కల—ఇదేమే? నీతోటినాకు చవతిపోరు గల్గినది.

సరో—పేరుజెప్పిన పిమ్మట మాటయది.

కల—(నగులుతో) చెలి వన్నెడ్పులమటయే నీకానందమా?

సరో—ఏమ్చట యెందుల కమ్మా.

కల—ఎందులకా "పిల్లికి చెలగాటము యెలుకకు ప్రాణసంకటము."

కం॥ నీకన్యాంతి వినోదము
నేకూర్చెను బలుకునాదు చిత్తముగలమా
లోకము లోకడ యాగదు !
[illegible]

సరో—(చుబుకము బట్టుకొని) అక్కా- చిన్ననాటనుండియును నొక్క ప్రాణమువలె మెలగుచున్న వారమగుట జేసి యేటులంటివనిగాని—నిన్నాయాస పరుపగాదు. కాని నేటి నగరు మనయిర్వురిలో దాపరిక మనునది మన్ననకైన గలదా ? నీవే చెప్పుము.

కల—ఇప్పుడుమాత్రము నేనేమి దాచితినే ?

సరో—నిన్నే బ్రశ్నించు కొనును.

కల—చెప్పజాలక సిగ్గుచే మ్రగ్గుచుంటివనిగాని నీకడ దాచిపెట్ట వలయుననిగాదు. నీ కిపుడేమి కావలయును ?

సరో—నీ ప్రియుడు (నవ్వును)

కల—(బొమలు ముడిపెట్టి) చావుము పాడుమొగముదానా.

సరో—నీ శోభనముగాంచి మరి చచ్చెదను.

కల—(కోపముతో మూతి బిగించి ప్రక్కకు గాంచును.)

సరో—(పకపక నవ్వును)

కల—(చిరాకుతో) భూతము పట్టినదా యేమే ?

సరో—నీకు బట్టిన భూతముపేరు కొంచెము జెప్పుమక్కా !

కల—(కలకలనవ్వి) అంగుళీయకమున కలంకారమేది ?

సరో—రత్నము.

కల—దానికే మరియొక పేరు.

సరో—(యోచించి) "మణి" యని యేనా ?

కల—అవును—కంఠమునకు మరొక పేరుజెప్పుము.

సరో—గళము,

కల—అదిగాదే-గళమునకును జలదమునకును గలసివచ్చు శ్లేష వాక్యముం జెప్పుము.

సరో—ఇవియన్నియు నెరుగుటకు నీయంతటి పాండిత్య నాకును గావలదా ?

కల—నీ వక్రోక్తు లమాని యోచింపుము.

సరో—(ఆలోచించి) 'కంధర' యని యేనా ?

కల—(ముసిముసి నవ్వుతో) అవునా రెంటింగలిపి చెప్పుము.

సరో—"మణి-కంధర" (నవ్వి) ఎవడా నారద శిష్యుడేనా ?

కల—(లజ్జతో యూరకుండును.)

సరో—(చూచి యానందముతో) అక్కా- ఆహా యేమందము!

గీ॥ పసలుగావున సరిపోయె, బ్రిదికినార
మటులనే బ్రాణమాని శియయ్యో నేని
బాగగు నిప్పటి నీ ముఖాంబుజము జూచి
నిగ్గున సుధాంశుడు లసమ్మ సేయజనడె ?॥

మ॥ వికసింపంబూచి యున్న కింశుకప్రసూనంబులన్నియున్ ఘనమౌ నెట్టదా
ను గట్టులెల్లయు పోగ, తారకలఁ గూర్చి బింబంబుల్జలంబందు దా
ల్చిరహిన్జూపము సోలె సంగమిగుల న్జైవాతృకుని కాల్వడా
నరయన్ శక్రధనుర్విలాసమున నౌరా! శోభయొప్పారెడున్॥

(పైకిజూచి) ఈ క్రిందనేమున్నది! అవిచిత్రాకాశము
నై వునకించుక నీజూపుకల్వల బ్రసరింపజేయుము.

కల—(చూచి) అరరే!

శా॥ నీలాకాశముపై, పిశంగరుచి సంధిల్లంగ బొల్పారుచు
న్వ్యాలాయంబుగ నంతటన్ జలదములావ్యాపింప, నందంము
ప్రోల్లీల న్పొసఁగు శక్రచాపకళకలాల్వి భ్రాంతి పైదోచదు
న్నాలోకింపతి పశ్చిమాత్రి కొఱకై గట్టించు కెందాలనన్॥

అదుగో పశ్చిమగిరి శిఖరముంజేర నతిత్వరితముగ బ్రయాణ మొనర్చుచున్న భానుదేవుడు వివిధ వర్ణ సంకలిత మేఘ శకల పరివృతుడై యేవిధముగా శోభించుచుండెనో గాంచితివా ?

గీ॥ తరణియను సూర్యదేవు వర్ణించు వివిధ
రమ్యకాంతుల చిమ్ము సస్త్రవముల నమ్మ
వచ్చి, పశ్చిమాద్రింపు గచ్ఛయంగు
బగచుచున్నాడు జనులెల్ల భ్రాంతినొంద

ఇకనుయ్యెలల నూగనేగుదమురమ్ము త్వరలో జీకటి యలముకొని రాగలదు.

సరో—అటులే పోవుదము రమ్ము.

(ఇర్వురు నిష్క్రమింతురు)

(రంగము—ఆకాశమార్గము.)

(నారదుడు, వెంట,మణి కంధరుడు బ్రవేశింతురు.)

నార—పుత్రా! దానికొక పూర్వగాధ గలదు.

మణి—(వినయముతో) నేనుగూడ దీనికేదియో ప్రత్యేకకార
ణముండితీరునని దలచితిని. లేనిచో— సంగీత విద్యా
మర్మవేదులగు తామేమి, యీగోపాలకృష్ణునికడ విద్య
నభ్యసించుటయేమి?

నార—తప్పు,-తప్పునాయనా, అటుబలుకబోకుము శ్రీకృష్ణు
డననెవరుగా భావించితివి?

గీ॥ దేవ దేవేశులకునైన దెలియరాక
నఖిలమౌనీశులకుగూడ నందరాక
నాది మధ్యాంతరహితుఁడై యాద్యుఁడైన
యట్టి బ్రహ్మంబె సుమ్మీ, యీయాదవుండు

సీ॥ దేవకీవసుదేవ దివ్యకుశేశయ
మేమకరందంబు నై యెసఁగె
నందయశోదాద్య మందభక్తి లతా మ
తల్లి యేమందార మల్లుకొనియె
సద్వర్షి చాతక సంఘమేఘమునిక్ర
పావృష్టికాలకయి పాళికులాడె
గోలలైనట్టి యాగోపికాజనకుము
దంబుకే చంద్రికయనియుమండె

గీ॥ భరతఖండమే శశిముఖి పరిసరితమగు
నొక్కత్స్నా గీతాసరిపంతిలో సోలిపోయె
గుప్తవర నాధులనెవాడు మునిమెటీల
నట్టి శ్రీకృష్ణుడె పరమాత్మ సుమ్ము॥

ఇక, పూర్వవృత్తమ్ము దెలిపెదనినుము.

మణి—చిత్తము సావధానుడనై యున్నాడను.

నార—పూర్వమొకనాడు నా కాంతపురమున వసుస్తదేవ, ఋషి, ముని, గణమ్ములచే నిండియున్న లన కొలువుకూటము నకు

కమలజుడు ముందునడచి మార్గమ్ము జూప
లచ్చికేల్పట్టి నాతోంట నచ్చుచుండ
నధిక వైభవమున హరియరుగుదెంచి
సుగుణసాంద్ర సింహ పీఠినా గూరుచుండె!

ఆ శ్రీమన్నారాయణునిం గాంచినతోడనే సదస్యులెల్ల నొక్కపెట్టున జయజయధ్వానంబులొనర్చి నుతింపసాగిరి కల్లోలిత సాగరముంబోలి శబ్దాయమానమై, ఘూర్ణిల్లు చున్న యానభనుతన హస్తసంజ్ఞచే నిశ్శబ్దమొనర్చుచు, బ్రహ్మదేవుడులేచి గాయకసంఘమున కాహ్వానమొ సెన్గెను. అదివిని నేనును, మరికొందరమును లేచి ముందు నకేగితిమి మాయెల్లరిలోనను తుంబురునకొక్కనికి మా త్రము స్వాగతమొసగబడెను.

మణి—(ఆతురముతో) తమకో?

నార—త్వరపడకుము వినుము మిగిలినమేమెల్లరము వేత్రహ స్తులచే ద్రోయబడి యొకచోట గూలబడితిమి—నావ్రే

త్యర్థితుంబురుడుమాత్ర మామహావిష్ణుసన్నిధి నొకయు న్నతాసనము నధిష్ఠించి, సగర్వముగ గానముచేయ నారం భించెను. ఎల్లరునువిని తలలూపుచుండిరి గాని, నాకు మాత్రమది కాచినసీసమ్ముల చెవులందూరుచుండెను. వానిగానము పూర్తియైనంతనే నేనులేచి నిలువంబడియా క్రోశింపుచు 'నిదిమిగుల విపరీతము నేనాతనికంటె మనో హరముగ గానముసల్పగలను. అట్టినన్ను వేతొహాస్తు లచేనెట్టించి వానిచేమాత్రమే పాడించుట పక్షపాతము గాదా' యంటిని.

మణి—శబాష్ మిగుల మంచిపనిజేసితిరి తర్వాత

నార—అందులకు మహావిష్ణు 'వంగీకరించి, మాయిరువురి దారతమ్యమునిరూపింప భారతీదేవిని, నియమించి, యిక పాడుమని సెలవొసంగి నేను నాశక్తియంతయుం ధార బోసితిని.

మణి—అందులకు సందేహమేముండును.

నార—మాధ్యస్థపీఠమందున్న శారద, నాగానమెల్ల నాలకించి 'చాలబాగుగనున్నది గాని, నీవుమరికొన్ని రోజులీతుం బురునియొద్ద సంగీతమర్మము లభ్యసించిన నుత్తీర్ణుడవు గాగల' వనిబల్కెను.

మణి—అవునా కాలమహిమ!

నార—కాకేమి? అప్పుడు నాకాయవమానము ప్రత్యుపకారంబె నెక్కుడుగాగా, లేచివచ్చి కొన్ని దివ్యసంవత్సరములు శ్రీ మహావిష్ణువుంగూర్చి తపంబుసల్పితిని. అంతటనా తడు ప్రత్యక్షమై "వత్సా! నేను కొన్నియేండ్లకు ద్వారకలో కృష్ణనామంబున నుద్భవింతును. అప్పు నీవే తెంచి, నీకొఱంతబాపుకొమ్మ" ని సెలవిచ్చి యంతర్ధానమయ్యెను.

మణి—ఆహా!

నార—అందుచే నే నిప్పుడీమహాత్ముని సేవించి సంగీతవిద్యా మర్మములెరుగుచున్నాడను.

మణి—తెలిసినది మహాత్మా! మీకిపుడవి పూర్తియైనవా?

నార—ఆ చాలవరకు.

మణి—గురువగా—ఇదిగో ద్వారక లోనికేగుదెంచితిమి (క్రిందికి జూచి యాశ్చర్యముతో) మహాత్మా అటుజూడుడు! అటుజూడుడు!

క్రొంతెంబోచును గొప్పువీడి, కచసంఘంబట్టె జీరాడగా
వింతన్ సిగ్గులబట్టి, మోమున నునుజె స్వేదాంబువుల్జార, దా
నెంతే నూగొయ్యెలలూగు సుందరినిగాంచే? దేశికా! దేవతా
కాంతాబృందము మీదకయ్యామునకున్ న్యాక్షాచలాగొప్పెడిన్॥

ఎవరు జూచెదరోయంచు యించుకంత
సిగ్గుతో గుంజి-నిడుదలై చెలువమొసగ
జాలి, కాసంతభీతితో మేళవించి
చిత్తములమానుకొని పోవుచేడెమిన్న
వాలుజూపులు, జగమేలజాలవొక్కొ॥

నార—(చూచి సంతసములో) అవును.

సర్వ లోకంబులందేను సంచరించి
గాంచితి ననేకజాతుల కామినులను
గానియీనాతి వామన భాగ్యమునకు
బోలజాలరు ముల్లోకములనుసతులు॥

(తెరలో) ఆవలున్న దెవ్వరో ?

మణి—(పైకిజూచి) గురువరా యీమేఘమాలిక యావలనె వ్వరోనిలిచి మనల ప్రశ్నించుచున్నారు.

నార—అరుగో (చూచి) వారు మనసమీపమునకే వచ్చుచు న్నారులే రానిమ్ము.

(అంతటనొక విమానముమీద రంభానలకూబరులు ప్రవేశింతురు.)

రంభ—ఎవరువారు అంతధైర్యముగా బల్కినది.

నల—(చూచి) ఊరకుండుము. దేవర్షియగు నారదుడువోలె నున్నది-అవును (సమీపించి) నారదమునీంద్రా! శిష్యు డునలకూబరుడు నమస్కరించుచున్నాడు.

రంభ—మహర్షిచంద్రా! నమస్కారము ఈ విమానముపైకిరండు

నార—సంతతాను రాగవృద్ధిరస్తు (శిష్యునితోగూడ విమాన ము పైకిబోవును.)

రంభ—తామింతకుముందు శెలవిచ్చిన పద్యమేది ?

నార——(నవ్వుచు) అదిగో నాశ్రమదావనంబున నుయ్యేలనూగు పురంధ్రీ రత్నముంగాంచితివా ? ఆయన్నుల మిన్నగాంచియే నేనాశీర్వచనము బల్కించినది "సర్వలోకంబులం దేను" (అనుపద్యము మరలజదువును.)

రంభ——(అసూయతో) కావచ్చును. (నలకూబరునిదిక్కై) మనోహరా! యికమీరు క్రిందికిజూడకుడు, చూచినచో సీ ఋషిపుంగవుని యాశీర్వాదమబద్ధము గావలసి వచ్చును.

నార——(బొమముడితో) అదెట్లు ?

రంభ——ఆపి నీయనగాంచి భ్రమించి నన్ను ద్యజించిన ?

నార——(తొందరగ) త్యజించిన ?

రంభ——త్యజించినచో మీయాశీర్వాద మేమగును ?

నార——నాయాశీర్వాద మేమని ?

రంభ—— "సంతత పరస్పరానురాగ పూర్ణమస్తు" ని

నార——అవును—రంభానలకూబరుల కెప్పటికిని యనురాగము నిండియుండునని గదా ?

రంభ——(హేళనగా) అవును-మునివరా ! నన్ను నలకూబరుడు త్యజించి వేరొకపడతిని జేపట్టినవెనుక—రంభానలకూబర

ప్రేమవల్లికి యవిచ్ఛిన్నత యెట్లు సిద్ధింపగలదు? మీ యాశీస్సు నిజమెట్లు గాగలదు?

నార—(నవ్వుచు) అదియా నీయభిప్రాయము.

నినుబోలిన, రూపముగల
వనితయొకతె పినిగలసి నలపింపగ-నీ
తనిబోలు ప్రాణేశుడు నీ
మనమలరగ జేయు, నాదుమాటనిలువదే॥

అప్సరః కాంతారత్నమా! నామాట నబద్ధముజేసెదవా?

రంభ—(చిన్నబోయి కనులనీరు బెట్టుకొనును.)

నల—(తనలో) ఎంతలోనెంత వృత్తిమునుక సంభవించినది. మునీంద్రుల మనస్తత్వంబెరిగియు నాప్రేయసి యీమహర్షిని రేగగొట్టి లేనికష్టము నత్తిపైకిదెచ్చుకొన్నదే! అక్కటా! పూర్ణిమశశినిగేరు నామనోహారిణి వదనంబెంత వాడిపోయినది. ఇకనేనూరకుండిన ప్రమాదము సంభవించును. (ప్రకాశముగా) మహర్షివరా! మూఢులమగు మాయందుకరుణించి యశ్రేయ ముపసంహరింపుడు మమ్ము క్షమింపుడు!

మణి—నలకూబరా! యిందు నీవంతకళ్లోల పడదగినదేమున్నది? అట్లుగాకున్న నిట్లుగానూహదాయనిజెప్పి తనవాక్య

మును దాను సమర్థించుకొనినాఁడే గాని దేశికులవారు, వేరొండు లేదుగదా ?

ఈవనిత-చింతచే దిన్నబోవ్రుకేల ?
వాస నీహృదయము బరితాపమొంగి
బొదలగానేల ? నిర్వైరు వెదరనేల ?
మాటవరుసకు బల్కిన మాటగాదె॥

నల—మణికంధరా ! అట్లనకుము వారినోట వెడలిన మాటవమ్మగుట దుస్తరము అందుచేతనే నేనింతగా భీతిల్లవలసి వచ్చినది.

రంభ—(భయముతో) మహాత్మా.

తెలియాకనే నవిచార్యం
బులబల్కియు నుంటినేని పూర్ణకృపమెయిఁ
గలయుంగాంచుడు వేగమె
చిలకింపుము ఓష్ఠవాలె దేవమునీంద్రా !

(పాదములపైబడును.)

నార—(నవ్వి) పిచ్చిదానా ! వేడుకకనుకొనినమాటల కింత్రరా భ్రాంతమా ? ఒకవేళనామాట తప్పకజరిగినేని త్వరలో నది మీకుశుభమగు గాక ఇకపొండు.

రంభ, నల—ఇప్పుడు మాగుండెలలోని భీతియడగినది.

నార—శ్రీకృష్ణదర్శనమునకు వేళయైనది.

(నిష్క్రమింతురు.)

---

# ద్వితీయాంకము.

(రంగము ప్రమదావనమందొక భాగము.)

నారద మణికంధరులును, యెదురుగా కోయిలొగ్గి
కలభాషిణీ సరోజనులును, సంభాషించుచు ప్రవేశింతురు.

నార—కుమారీ! కలభాషిణీ! వెదిఆపద్యమును మరొక్కమారు పాడుము.

సరో—తమశిష్యునిచే రచింపబడినదగుటచే దేరవవారికాపద్యమందంతయాదరము.

నార—(నవ్వుచు) కేవలమదొక్కటే కారణమేగాదు మామణికంధరుని కవిత్వము మకరందమాధురీధురీణమైనను అమృతరసనిష్యందియగు కలభాషిణీ కంఠస్వరముతో మేళవించుటలోనే, నాకంత యాదరము గల్గినది.

కల—(భక్తితో) పుత్రపుత్రికావాత్సల్యమిచట మేరమీరినది దేవర్షిసత్తముల యనుగ్రహమునకు పాత్రమైన యీయల్పకీటకమునకు జన్మము తరించినది.

సరో—(కలభాషిణితో) శ్రీవారి యాజ్ఞాపాలనమొనర్పుము.

కల—(డగ్గుత్తికతో) సూర్యుని సన్నిధిని మిణుగురుబుర్వురెక్కల నార్చునట్లున్నది. పరోక్షమున వారిని జూడకయే వారు న్నారనియైన నెరుగకయే—చేసినకార్యము ప్రత్యక్షమున నొనర్చుట యెట్టి కష్టతరమో బోధమైనది.

సరో—నీశరీర కంపమే నీయవస్థను వెల్లడించుచున్నది. గాని— ఆజ్ఞ యనుల్లంఘనీయముగదా?

కల—ఇదిగో పఠించుచున్నాను. (కంఠము సవరించుకొని.)

ఏకోలపే గ్రంము నింపుసౌ సర్పింప
చక్షుర్మయూరముల్సంతసించు
నేహారిన్మణికాంతి నెస్పందు శోభిలంగ
భక్తాళిచిత్తముల్పల్లటించు
నేనల్లగల్వపై నెంతేని వ్రాలిలంగ
కామినీభృంగముల్కాలవరించు
నేపికగానాబ్ధి నీదులాడగ-జీవ
వాసంతికాతరుల్మోసులెత్తు

నేమనోమోహన శ్యామలామలాంబు
పూర్ణ యమునానదిం దేలిపోవుటకును
మునిహృదయ నౌకనెప్పుడు మోహరించు
నట్టి శ్రీకృష్ణతేజమ్ము నభినుతింతు॥

నార—(పరవశుడై) కవితగాదిది యమృతము. ఆహాహా-గాన ముగాదిది మకరందఝరి!

మణి—(విధేయుఁడై)గాన మట్టిదేగాని కవితయందంతటి గొప్ప దనములేదు.

వార—పుత్రికా (ఆదరముతో చేరదీసి) నీకవితా మాధుర్యమును, దానియందలి గొప్ప దనమును, గూర్చి నీవట్లు బలుకదగును గాని సత్కవి వాక్యామృతధారలచే సరసు లుప్పొంగుట స్వాభావికము సుమా! అదియునుంగాక

'చలువ'చే బొలుచువెన్నెలకు సౌరభముబ్బ
యందఁజా గోరింబస నందియున్న
'చలువ' 'సౌరభమును' గలుగుకప్పురపు బ
ల్కులకు 'గోమలతయు' గూడియున్న
'చలువ' 'సౌరభము' 'కోమలత' గల్గిన చల్ల
గాలికి 'మధురిమ' గల్గియున్న
'చలువ' 'సౌరభము' 'కోమలత' 'మాధుర్యంబు'
గలమరందము 'కాంతి' గలిగియున్న

స్వర్నదీహేమ తామరసంబు నుండి
గళితమౌ మకరందపు కణములగతి
కమ్రసుఖము బ్రసాదించు గవులముద్దు
పల్కులకు నీడుగా నెంచ వచ్చునపుడు॥

మణి—శ్రీకృష్ణ దర్శనమున కాలస్యమగుచున్నది.

సరో—(నమస్కరించి) ఈ మీశిష్యురాలికొక వరమనుగ్రహింప బ్రార్థింపుచున్నది.

నార—(కలభాషిణి దిక్కై) బిడ్డా యేమియుగ గోగదవు?

సరో—(వినయముతో) తమకు శుశ్రూషచేయునట్టు మహా
భాగ్యము.

నార—(నవ్వుచు) దానికి నేడు గొత్తయేమి? పోదమురండు
కాలాతిక్రమణమైనది.

(అందరు నిష్క్రమింతురు.)

---

(రంగము శ్రీకృష్ణ సభాభవనము.)

(యథాస్థానములపై గూర్చుండి శ్రీకృష్ణుడు బలరాముడు
నారదుడు మణికంధరుడు యాదవ వీరులు ప్రవేశింతురు.)

నార—దేవా! నేనిక సెలవు పుచ్చుకొందును. బలదేవాదు
లేదియో రాచకార్యముల నాలోచింప నేతెంచి నట్లు
న్నారు.

బల—కృష్ణా! నారదఋషిచంద్రుని గాన విద్యా మర్మజ్ఞత
యింకను పూర్ణత నొందలేదా?

కృష్ణ—నేటితో పూర్తియైనది. ఇక నీదేవఋషి దర్శనము
మనకు నియతముగానగు భాగ్యము దొలగిపోయినది.

నార—(నవ్వుచు) నే నెప్పుడును త్రిలోక సంచారినే?

కృష్ణ—కావచ్చును. త్రిలోకము లనగా నొక ద్వారకానగరమే గాదుగదా?

నార—తండ్రీ భక్తవత్సలా! నేనెచ్చట నున్న నేమి? నాహృదయ వీణావాద మెప్పుడును భవదీయ దివ్యనామ గానమునే యాలాపించు చుండునుగదా అదిగాక మీచిత్తము నందే నిమునమున నన్ను జూడ గోర్కెబొడమునో, యాయుత్తరక్షణముననే దేవరసన్నిధి నుండువాడను.

కృష్ణ—(యాదవులతో) మీరేదియో విశేష కార్యవశమున నేతెంచినటుల దోచుచున్నది. నారదఋషి సన్నిధినే యాకార్యము చర్చింపబడుగాక—అదేదియో త్వరగా దెల్పుడు.

యాద—మహాప్రభూ! మగధాధినాథుడగు, నా జరాసంధుని దుండగములు పెచ్చుపెరిగిపోయినవి యీభరత ఖండమునందలి యోగ్యులగు మూర్ధాభిషిక్తులెల్ల నాతని యింట బందీలై యున్నవారలు వానిభీతిచే లోకులెల్ల ప్రాణము లరచేత నుంచుకొని జీవించుచున్నవారలు. మానవతుల బాధలిక—

బల—(కోపముతో) మనగౌరవము మాత్రమెవరు మన్నించుచున్నారు.

ఎదిరిబలమును తనబలంబెరిగి సమయ
మునకుదగినట్లు నడచుదు-నసువుదెలిసి
పగతుఱకఁ రూపుమాపెడువాఁడె పో, వి
శేషధీశాలి-వాఁడెపోసిద్ధవిజయి

కావున లోకుల మాటలు విని మీరుత్వరపడకుడు.

యాద—దేవా! కేవలము లోకుల మాటలుగావు ఇప్పుడు
పేక్షించినచో లోకము తల్లడిల్లిపోవును.

కృష్ణ—నేడు క్రొత్తగావచ్చిన యుపద్రవ మేమి?

బల—వాఁడొక దేవతకు జాతర దలపెట్టినాఁడట అదిపూర్ణమగు
రోజున దనకడ బందీలైయున్న మూర్ధాభిషిక్తులయు-
బాలికలయు శిరముల గోసి యాదేవతకు బలినిచ్చు
నట.

కృష్ణ—(చేవ్రురించుకొనిన మోముతో) వానిపాపఘట మిప్పు
డు నిండిపోయినది. ఇకను పేక్షింపరాదు ఉద్ధవా! నీ
వేగి ధర్మజునితో నామాటగా, రాజసూయ యాగప్ర
యత్న మొనర్పుమని చెప్పుము కిరీటిని భీముని నీవెంట
గొనిరమ్ము.

బల—యాదవులారా! ఇకమన మేగుదమురండు.

నార—దేవా నాకుగూడ శెలవా?

కృష్ణ—నారదా! నీవుతక్షణ మంతఃపురమున కేగి నాదేవేరుల
యొద్ద నీగాన విద్యామహిమనుబ్రదర్శించి వారి

మెప్పొంది రావలయును. దానికి కొండొక కారణంబు
గలదు: శీఘ్రమే పోయిరమ్ము.

కార—మహాప్రసాదము (లేచి మణికంధరునితో) కుమారా
నీవా పరిమళావన ప్రాంతమందుండుము త్వరితముగ
నిన్నట గలసికొందును.

(తొగవధును.)

(రంగము పరిమళావనము.)

(విచారముతో కలభాషిణి ప్రవేశించుచున్నది.)

కల—ఆహా—కన్నులున్నందుకు సాఫల్యత సిద్ధించినది. అతనికి సౌందర్య సామ్రాజ్యములకెక్కుటలో జయంత నలకూబరుల నెన్నుటను, వినుటయేగాని—అనుమానీయ దివ్యాల తమాజులను ప్రత్యక్షముగా దర్శింప మానవులకు దుస్సాధ్యముగాదా ? అట్టివారిలో నొక్కని—నలకూబరుని నేటికి కనులారగను భాగ్యము నాకులభించినది. ఓహో! అతని స్మరించిన మాత్రముననే నాశరీరము పులకిత్త యనిర్వచనీయావస్థకు పాల్పడుచున్నది. (ఇంచుక యోచించి) అక్కటా యీచిత్తమెంత చంచలమైనది. ఒక ముహూర్తము వరకునుగూడ మణికంధరుని యిష్టదేవ ముంబోలె దనయందు నిల్పుకొని సర్వదా ధ్యానింపు

చున్న నాయీపాడుచిత్తము నలకూబరునిం గాంచిన దాఁనిగ నేమేమియో పోకడలుబోవుచున్నది. (ఆలోచన ట్లునటించి) నిజముగా నాకిది యాకుబేర కుమారునిపై గల వలపుగాదుగదా? అదేమియో అయ్యశ్లేసను తుదు మరచిపోదమన్నను మరపునకురాకున్నాడే! యేమిచేతును? యిందులకే గాబోలును "క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తము" లని యొక మహానుభావుడు వచించినాడు-ఛీ! పాడుచిత్తమా! నీకంత చపలత్వ మేల? చిరకాలమునుండి ప్రణయమంత్రాధిదైవత ముగ నెంచి, పూజింపుచు, జపించుచున్న హృదయేశ్వ రుని తృణముగాభావించి దర్శనైక మాత్రముననే, ప్రేమాధిక్యముం గ్రహించి యానలకూబరునుపాసిం పుచున్నావు. అయ్యయో! ఇతరచ్ఛాయాకళంకితవై పోవా?-కాంతాకులమందు గర్హమనైపోతినే? దైవ మా?

మంచియొ జెడ్డయొ మొదటమానసమందొక నిశ్చయించి-ప్రే
మించి, మహాదుర్నైన మది మెచ్చక "భారతవర్షసాంఖ్యసౌ
యొంచగడగ్గరవా" రను సహీనయశంబును గన్నభూమిపై
చంచల చిత్తగానిటుల జన్మమునొందగ జేసితేపిధీ॥

ఔరా! పాపాత్మురాలనగుసేనానియతినిగూడ దూరు చున్నదానను నాహృదయ దౌర్బల్యము ననవలెగాక

సృష్టి కర్తకిందేమి భాగమున్నది ? తెలిసినది- తెలిసినది.
యిదియెవ్వరి దోషమునుగాదు.

> ఒకని సంస్మరించి గమ్యంబు నొకనిబిలిచి
> యొకనిచే నర్మముంగొని- యొకనిగూడి
> మను సూపు పిలిచినా వనజనేత్ర
> కాంత సై-యిలబట్టు వుంగనుటజాలు॥

అవును-యిది నిశ్చయముగా నాస్వప్రభావమే. కాదేని
యింతటి జదువులంజదివి యేయేమహాత్ములకో శిష్యు
రాలననిపించుకొనిన, నాచిత్తమే స్వైరిణియైనచో నిక
నితరులు ననసంసిసిన డేమున్నది ? హామణికంధరా !
నిన్నెట్లుమరతును ? నీకెట్లు ద్రోహముజేసగలను ? వాగ్ద
త్తనే! పాపినగుచుంటినే? పరిశుద్ధ హృదయుడవగు నీకు
నేను తగుదునా? తగుదునా?—తగుదునా ?—తగనప్పుడు
ఆయ్యో నలకూబరా ! నిన్ను నేనేవిధముగా మరచిపో
వుదును ? యేమహానుభావుడైన నాకు విస్మృతిమంత్రి
ముపదేశించునా ? మన్మనోధనచోరా ! నలకూబరా !
చందమామకు చేతులుసాచినట్లుగా, నగమ్యుడవగు నీ
కొఱకు నాచిత్తమింత తత్తఱపాటొందుచున్నదేమి ?
మణికంధరా—వలదు నలకూబరా—వలదు—వలదు-హా
హా-హా.

కేదువనమున కేనురానేల? వచ్చి
యుంటిబో రంభగూడి దాను త్తరేశ
సుతుడు జనుదేరనేల? నేజ్వాడనేల?
జూచి యీదృశగతికి నోచుకొననేననేల?

అదుగో భగవానుడగు నారదుడు కృష్ణనామముంబా
డుచు నిటకే వచ్చుచున్నటులున్నది.
(నారదుడు మణికంధరునితో గూడ పాడుకొనుచు బ్రవేశము)

మణి—నామనవి యేమొనర్చితిరి.

నార—కుమారా! నీకీయకాలపుణ్యక్షేత్ర యాత్ర నెవరుపదే
శించిరి.

మణి—తామంతఃపురము లోనికిబో యినతర్వాత నేనేమియుం
దోచక చతుష్పథమునొద్ద నిలువంబడియుంటిని అచ్చటి
కొకసిద్ధుడేతెంచినాడు పుణ్యక్షేత్ర సందర్శనమహిమ
నొక్కింత యుపన్యసించినాడు. తదాదిగా నాచిత్తమం
దులగ్నమైనది. తాము శెలవిచ్చినచో నతిశీఘ్రముగ
బోయి త్వరలో మరల దమపాదసేవకై దిరిగిరాగలను.

నార—నాయనా! నీకిప్పుడేమంత వయసుముదిరినదని యీపు
ణ్యతీర్థ సందర్శనాభిరామ గలిగినది. యతికిసంగముత్య
క్తమైననుగూడ, నేదియో ఋణానుబంధముచే నీతోటి

మేళనము నాకొదవినది. దానిచే నే నెంతయో దృప్తుఁడ
నై యుంటిని అట్టినన్ను విడచిపోవ నీకు మనసెట్లు సమ్మ
తించుచున్నదో యూహింపరాదు.

మణి—దేశికేంద్రా! నన్నట్టి విశ్వాసరహితునిగా దలచితిరా?

జనకుఁడు గడు బాల్యమున నప్పగించిన
 విసువక నతిప్రీతి బెంచినారు
భాషింప నేరని బాలకుండనక మ
 చ్చిక జేసి కళ లెల్ల జెప్పినారు
ప్రాపంచిక జ్ఞాన లోపంబు రాకుండ
 దేశదేశంబుల ద్రిప్పినారు
మహనీయులన్యగ మనుజాదులం జూపి
 వారి మైత్రికి పాలుపరచినారు
సాగరము మీఁదు గాన శాస్త్రంబునం బ్రి
[illegible] నీయంతవానిగా సల్పినార
లిట్టిమిమ్ముఁడబాసి నేనెచటకేని
బోవకాల్గాడునయ్యా? నేబోదునయ్యా?

కాని-నాల్గుమాసములు మాత్రము నాకు శెలవిందు తరు
వాత మీసేవకు బరువెత్తుకొనివత్తును.

నార—ఉండుముండుము! ఈ సమీపములో కలభాషిణిగలదట
ఆబాలికతో నొక రాచకార్యమున్నది

కల—(సమీపించి నారదునకు నమస్కరించి) ఏమి శెలవు?

నార—(రహస్యముగా) పుత్రీ! అంతఃపుర కాంతలసన్నిధిని, నన్ను బాడి, వారిమెప్పందుమని శ్రీకృష్ణుడు నాకానతిచ్చినాడు. గానమొనర్చి వచ్చితినిగాని వారియుద్దేశము లెట్టివో నీవు రహస్యముగ నెరుగవలసియుండును.

కల—(రహస్యముగ) నేను తమశిష్యురాలనని వారెల్ల నెరుగుదురు. కావున నాయెదుట తమగూర్చి నయథార్థోద్దేశము వెల్లడింప వారోడుదురు గాన నాకొకతాము కోరినరూపమొందగల శక్తి నొసంగినవారి కంచారికలలో నొకతెనై సర్వవిషయముల నెరుగగలదానను.

నార—(తనలో) "బుద్ధిఃకర్మానుసారిణీ"-కాని నేనువైచినపథకమునకు గూడనిది చాలననుకూలమేగాగలదు. (ప్రకాశముగ) బిడ్డా అట్లేయొసగెదను. (చెవిలో నేదియో జెప్పి) యీమంత్రమును బఠించినచో నీవుకోరినరూపము నీకురాగలదు. ఇక నీ ప్రియత్నమునందు ప్రవృత్తవుగమ్ము.

మణి—గురుదేవా! నాప్రియాణమునకు సుముహూర్తమాసన్నమైనది. (క్రీగంట కలభాషిణిని జూచినిట్టూర్చును.)

కల—(క్రీగంట మణికంధరుని జూచుచుండును)

నార—(నవ్వి) ఇన్ని జెప్పిన దింకుకొఱకేనా?

మణి—(ఉలికిపడి) ఏమిటి మహాత్మా!

నార—నేనిన్ని జెప్పినదిగూడ నీప్రయాణవిషయమై వ్యర్థమా యెనా? పోవక దప్పదా?

మణి—మీయాజ్ఞగానచో

నార—సరిసరి నీవు పుణ్యమార్గంపసించ నేను నలదంటునా? అటులనే పోయిరమ్ము.

మణి—(నాగదునకు సాష్టాంగ దండప్రణామమునొనర్చి లేచి) సెలవు (కలభాషిణివంక దీనముగజూచుచు) సెలవు గురుదేవా సెలవు (అని నిష్క్రమించును.)

నార—పుత్రీ! ఇక నేనుగూడ నేగివచ్చెదగాక, నీవు నాశాశ్ర మంద్రవమత్తవుగమ్ము ప్రొద్దువోయినది నీకుగూడ నీ ఏకాంత వనసంచారము మంచిదిగాదు పొమ్ము.

(నిష్క్రమించును)

కల—(ఆత్రముతో మణికంధరుడు బోయిన దిక్కుగాంచుచు) హా—నాయాశలెల్ల నేటితో దీరినవి. యిక నేమున్నది? నా ప్రాణవల్లభుడు—నాపూర్వ మనోహరుడు-సిగ్గుసిగ్గు- ఇట్టి దుర్భాగ్యురాలనగు నేను దనకుదగిన దాననుగానని

యెంచి విరాగియై పుణ్యతీర్థముల వెంటబోవుచున్నట్లు లున్నది.

పసియారువన్నెయ బంగారమును మీరు
డంబైన మిసిమి దేహంబువాడు
కందర్పునవమాన మొందజేయగజాలు
సౌందర్యమున విందుసల్పువాడు
చిరునవ్వు వెన్నెలల్జిందెడి మోహన
కరమైన ముద్దుమొగంబువాడు
తేనెసోనలుపారు తీయన మధురంబు
లైమించు మృదులవాక్యములవాడు

మనసుహరియించు చేష్టల దనరువాడు
నామనఃపద్మమందున నారతంబు
బంధురప్రియుడగుచు దాబరగువాడు
పోవుచున్నాడు నన్వీడి పుడమివెంట॥

నేనెంతసేపిట్లు దుఃఖించినను నారోదన మరణ్యరోదనము గాక మరేమగును? (కన్నీటితో) విధి విధానమెట్టులున్నదో దప్పింప నెవరితరము?

(నిష్క్రమించును)

# తృతీయాంకము.

## రంగము ఆకాశమార్గము.

(విమానముపై రంభానలకూబరులు ప్రవేశింతురు.)

నల — అయ్యయ్యో లతాంగీ! ఈ దుష్ట జలదఖండము నీకెట్టి యుపకారము చేసినది ?

> అడుసుగని త్రొక్కి యుంటివి యవని కాంత
> చెంతకేతెంచి దాఁకొంటి చేష్టఁ జేసి
> ప్రీతిబరువనమ్ము కలుషాత్మ, వృష్టి గురిసి
> బయ్యెదను దడిపెను జలదంబు నాయెనకట॥

(పైఁ జూచి) నీమేలి ముసుఁగెల్ల దడిసిపోయినది గదా !

రంభ — మనోహరా ! విషధరముల సమీపమున జేరినవారికి వాటికృతఘ్నముచే కీడుగా పరిణమించుట సహజమేగదా!

నల — కావున మనము తొలగిపోదమా ?

రంభ — ఆ ! భూమికిందిగుదము.

నల — ఇదిగో విమానమున క్రిందికిఁ ద్రిప్పించుచున్నాను.

రంభ — (ఆశ్చర్యముతో) ఆహా! రమణుఁ గాంచి భూమిపైకి శర వేగమునవాలిన విహంగ రాజముంబోలె యీవిమాన మెంతవేగముగా క్రిందికిందిగుచున్నది ?

నల—సుందరీ! మనము మరలనచ్చోటికే జేరినారము.

రంభ—ఎచ్చోటికి?

నల—ఇంతకుముందు నారదునితో మనకుసంభాషణము జరిగిన చోటికి—మబ్బు తెరవదలివచ్చుటచే మనకు నీద్వారకా నగర మెంతయందముగా గాన్పించుచున్నదో!

రంభ—అటుజూడు మటుజూడుము అది శ్రీకృష్ణదేవుని చంద్రశాల గాబోలును.

ఆమణికుట్టిమంగ భవనాంచిత కుడ్యలథాళథళ్యమా?
అమహితాచ్ఛ హేమ జలయంత్రశతంబుల నైగనిగ్యమా?
అమృదులాంగశోభిత శశాంక, ముఖాళులచాకచక్యమా?
ఏమనిచెప్పవచ్చు హృదయేశ్వర మాధవసౌధవసంపదల్॥

నల—(తిరిగిచూచి) అదుగో భగవానుడగు సూర్యుడస్తగిరి చేరువ కేగుచున్నాడు.

ఎలుగెత్తిపిలియించి చంచువుల నెచ్చటనుండియొ గూళ్లజేరగా
ద్వరితముగా గుముల్గుములు దద్దయువ్యూహములై నభస్థలిన్
బరుగిడు పక్షిసంతతులు భామ! విమానము గాంచిభీతిచే
బారినెటవచ్చుట న్పదరిపోవుచునుండె విచిత్రపద్ధతిన్॥

(పాఱజూచి) మాయురే-యీనజలనిర్గల మేఘశకలములకావృద్ధసూర్యుని కిరణములెంతలో నెంత మార్పుగలిగించినవి?

రంభ—(చూచి) ఆహాహా.

నల—ఈ దృశ్యమునిపుడు బ్రహ్మలోకములో బోల్పవచ్చును యేలనందువా?

> ఈస్వతంబొము సెల్లనై యొప్పుచున్న
> మబ్బునెంతను నెల్లనా మంచివెలుగు
> కాంతినొప్పారు గలదంబు గాలి, గాత
> నెంత భాగతిగూర్చున్న చెలువపూనొ॥

రంభ—(చూచి మిగులనానందముతో నొకమధుర కూజిత మొనర్చును.)

నల—(ఆనంద పరవశుడై) ఆహా-ఆహా—యేదీ—ప్రియా యేదీ మరల నొకసారి.

రంభ—(మరల నొకసారి యాకూజిత మొనర్చును.)

నల—(తన్మయుడై) అరెరే-మరల—మరల. నింకొకసారి. (ముగ్ధుడై) చెలీ! యిన్నిదినములుగా మనమిద్దరమును గలసియుంటిమి గాని యొక్క—నాఁడైన నిట్టి మధురధ్వనిని వినిపింపవైతివేమి? యేదీ_యేదీ. ఇంకొకసారి.

రంభ—ఇప్పటికి రెండుమారు లొనర్చితినిగదా! చాలదా!

నల—(ఉన్మత్తునిబోలె) వేయిమారు లొనర్పుము—పదివేల

మారు లొాంతర్యము—ఆమనోజ్ఞ స్వరసుధకు తనివినొం
దెడు మాధుడుగూడ గలడా ? ప్రియసీ.

రంభ—(మరపింపనెంచి) దానియుత్పత్తి స్థానమెరిగినచో మీరు
మరింత యామోదమొందెదరు.

నల—ఉత్పత్తిస్థానమా ? అదేమియో దెల్పుము.

రంభ—పోనిండు ఇప్పుడుగాదు దానికొక పెద్దగాధగలదు.

నల—(పట్టుదలతో)ఎంతగాధయైనను వినియే తీరవలయు.

రంభ—ఇప్పుడుగాదు మరొకప్పుడు దెల్పుదునులెండు,

నల—ప్రియా ! నాయొద్దగూడ దాపరిక మొనర్చెదవా ?

రంభ—(జాలిగా) దాపరికమా ? మనోహరా ! మీయొద్దదా
చదగిన సంగతి నాకడగలదా ? అట్టిదాచుకొనుటకు
నాకధికారము మాత్రమున్నదా ? కాని-అందుకొంత
భాగము జెప్పుటకుమాత్రమే నాకధికారముగలదు.

నల—(సాలోచనముగ) ఆధ్వని నీకెపుడుత్పత్తి కెందువలనవచ్చి
నది ? యీగాధ యేనాడుజరిగినది?

రంభ—మీప్రశ్నముల కన్నిటికొకకథయే జవాబొసంగగలదు.
వినుడు మున్నొకనాడు నేను సరస్వతీదర్శనాభిలాష,

సత్యలోకమున కేగితిని. ముఖద్వారముదాటి లోనికరు
గుచుండ ప్రతీహారిణి "దేవినాధునితోగూడి యుద్యాన
వనంబుననున్నద" ని వచించినది.

నల—నీవుగూడ వనంబున కేగితివా ?

రంభ—లేదులేదు. త్వరలో వచ్చునుగదాయని నేనాచంద్రశా
లం బ్రవేశించితిని. అందునాకొక వింతకాన్పించినది.

స్వర్ణమయమైన రమ్య పంజరమునందు
నిలిచియొక శుకరత్నంబు నేర్పుమీఱ
నేనిపుడుబల్కినట్టి గానస్వనంబు
పరమమోహన గతితోడ బల్కుచుండె॥

నేనా కూజితమువిని కొన్నిమారు లనుకరించి మెలమెల్ల
నాచిలుక యొద్దకుజేరి యాధ్వనిజన్మ వృత్తాంతంబడుగ
సాగితిని.

నల—నేను నిన్నువలె!

రంభ—వినుడు. కొండొక బుజ్జగించినమీద నాశుకము "ఇది
పరమరహస్య వృత్తాంతంబు దీనినెవుడును వెల్లడింపవేని
యెరిగింతు" నని చెప్పనారంభించెను.

నల—ఆవాగ్దానముచేతనా నాకడ దాచితివి ?

రంభ — కాదు కథవినుడు "ఒకనాడు పుష్కరిణీతీరంబున సరస్వతీ చతుర్ముఖులు సల్లాపములాడుకొనుచుండ నానలువరయొనర్చిన శృంగారచేష్టచే భారతీ వదనంబుననుండి యీవింతమణితమానిర్భవించినది. దానివిని బ్రహ్మయిట్లే పదింపది కొనగసాగెను- భారతికంత కోపమే తెంచి విముఖయాయెను. దానింగని విధాతయొక యాపూర్వకథనల్లి చెప్పసాగెను. భారతి యాకథను తన ప్రణయకోపమునకే సంబంధిచిన దానినిగా గ్రహించి యందలి విరుద్ధాంశముల కాక్షేపించెను. మరల వారిద్దరకును వాక్కలహమారంభమై, తన్మధ్యంబున బూర్వశృంగారచేష్టయొనర్చి, మరలనాకూజితను జన్మింపజేసెను- నేనాప్రాంతముంటిని గనుక నాకీకథయును కూజితము నెరుకపడినవి" అని యాశుకము నాకెరిగించుచుండెను.

వల — ధాతజెప్పిన యావ్యత్యస్తకథ యెద్ది ?

రంభ — అక్కడనే వచ్చినచిక్కు. వినుడు ఇంతలో భారతీదేవి మాయొద్దకేతెంచి రూక్షస్వరమున చిలుకం బెదరింపుచు శతా, తిర్యగ్జంతు చాపల్యంబు నీకెన్ని విద్యలునేర్పినను వదలినదిగాదు. దంపతుల రహస్యభాషలొక వేళవిన్నను నితరులయొద్ద బేలుదువా ?- ఈ నేరమునకై నీవ్వ

భూమిపయిం బుట్టు" మని యాచిలుకకు శాపమిచ్చెను.

నల—తరువాత.

రంభ—తరువాత నన్నుగాంచి నీవు విన్నయీకథను మూర్వారితో
జెప్పినను నీకు నదియేగతియని భర్జించెను.

నల—కటకటా నీవు నాకావృత్తాంతము జెప్పకుము గాని—నీకీ
సమయమ్మునం దాకూజితము యేల జ్ఞాపకమునకువచ్చె
నోమాత్రము దెలుపుము.

రంభ—మనోహరా! సంధ్యారుణ కిరణరంజిత మేఘశకలంబు
లంగాంచి నీవు భారతీ బ్రహ్మలకుబోల్పగా-నాకీవృత్తాం
తము తటాలున మనమునందు స్ఫురించి, యాపూర్వా
భ్యస్తమగు మణితము, జ్ఞప్తికివచ్చినంతట నే నాకంఠ
మునుండి బయలు వెడలినది.

నల—అదియా సరిసరి తెలసినది.

(ప్రవేశము ఆకాశమార్గమున నొక నిర్జరుడు.)

నిర్జ—(నలకూబరునికి నమస్కరించి) భర్తృదారకా! త్రైలోక్య
పతి, మహేంద్రుడు రంభ నతిశీఘ్రముగా బిలుచుకొని
రమ్మని నన్నంపినాడు.

నల—అటులనా? అయిన పోదముపద నేనుగూడ వచ్చుచు
న్నాను.

(నిష్క్రమింతురు.)

## రంగము అరణ్యప్రదేశము.

(ఏకాకిని రంభ ప్రవేశించును.)

రంభ—(విచారముతో) నాజీవితమింత హేయమైనదిగదా! యక్షాధిప సుతునితో నక్షయసౌఖ్యవారాసి నోలలాడు నన్నుబిలచి దేవేంద్రుడీ యడవిలో నెవ్వడో తపముసల్పు చున్నాడు గాన వానికి తపోభంగము గావింపబొమ్మని యానతిచ్చినాడు. నేనా సుఖమునకెల్ల, జలాంజలియొసంగి, యిచ్చటికి రావలసివచ్చినది ఆనాప్రియుడు అనలకూబరుడుగూడ నీ యరణ్యసమీపమున కేతెంచి విడువలేక విడువలేక నన్విడచుచు "ప్రియా శీఘ్రముగ నేతెంచు"మని గద్గదకంఠుడై పలికినాడు.

అక్కట! ప్రేమమెల్లదనయందెనయించి, తపించుచున్న యా
మక్కువగాని సేమఱచి మధ్యను వేరొకనింగడించి-వే
రొక్కని సైగలందనిపిరొక్కని పజ్జకుజేరుచుండు నీ!
యెక్కుడి ప్రేమ యేడపల, పెక్కుడినీమము వారనారికిన్॥

వేశ్యా మర్యాదంగూర్చి యావలచింతించెదను గాక! ముందు నాకేశునిపని గావలయునుగదా! ఆతండుచెప్పిన గుర్తులంబట్టిచూడ నాతాపసియున్న వనమిదిగానేదోచు చున్నది. ఈ మ్రుక్కడితపసి యేవయసువాడో యెట్టి వాడోగదా!!

బడుగులైనను చర్మాస్థిపంజరంబు
లైన గడ్డాలపోతులులైన నొంటి
కంపువారైన నెరైనగవయవలయు
బూరుషుల దప్పఁ బెందు నువారసతి॥

(కొంత దూరమునడచి) ఈతడెక్కడను గానబడడేమి? (పాఱజూచి) దూరమున నాసెలయేటిదరిని శిలాఫలకంబుపై నాసీనుండైయున్న మనోహరాకారు డెవ్వరై యుండును. (ఆలోచించుచు) వానినెక్కడనో గాంచినట్లున్నదే? తెలిసినది నారదశిష్యుడైన మణికంధరుడు. ఆతడిక్కడ నేమొనర్చుచున్నాడు? కన్నులుమూసుకొని జపముచేసికొను చున్నట్లున్నాడు (యోచించి) నన్నింద్రుడంపినది వీని కొఱకై గాదుగదా! అటులైన ధన్యనేయగుదును. నాచిత్తమిదివరకే యొకటి రెండుమారులు వీనిపై బారినది గాని నలకూబర పరివృతనగుటచే స్వతంత్రింప లేకపోయితిని. ఇప్పుడు స్వామికార్యమును స్వకార్యమును గూడ సిద్ధించినది. యీసమీపమున వేరొకతపసి యెవ్వడును లేడుగదా! (నాల్గుదిక్కుల కలయజూచి మణికంధరుని యొద్దకేగును) ఈతడీసమాధి నుండి లేచుట యెప్పుడో? అయినను నేనొక యుక్తిన ల్పెదను. (సన్నగరాగముతో బాడుచు సమీపశాఖను వంచి పూలుగోయుట నభినయించును.)

మణి—(చల్లగా కన్నులదెరచిచూచి) ఎవ్వరీకాంత?

రంభ—(చూచి సమీపించి) గాయకోత్తములకు నమస్కారము.

మణి—ఓహో రంభయా? ఇచటి కేలవచ్చితివి?

రంభ—నాకిచ్ఛ వొడమినది గనుక

మణి—చైత్రరథాది, దివ్యోద్యానములవిడచి నీయిచ్ఛయీకాఅడవిపై వచ్చినదేల?

రంభ—(చిరునగవుతో) అదియు నాయిచ్ఛయే.

మణి—నీయిచ్ఛకు నభ్యంతర మొదవింపను—గాని

రంభ—కాని, యేమి? ఒకరభ్యంతర మొదవించిన నాగుటకు నేనేమి మగనాలనా?

మణి—ఈడాబుల కేమి నలకూబరుని మాటను ఇనుమంతైన నతిక్రమింప గలవా?

రంభ—(పెదవులం జప్పరించి) అభయము నాకీషణ్మాత్రము గూడలేదు. కులకాంతలకు గదా యీనియమములు.

గళమున నాకుదాళి దసెగట్టెనో కోదల పోసిచూడ, నా
యలకపురాధి నాధసుతుడైనను సంగరముల్మ పాతపం
బులు యజనంబు లెన్నిదినముల్నలు పంబడుచుండు నన్నిరో
జులు భయమేలనాకు? దనసొత్తునో కోశలకాలమున్నఖా॥

మణి—కావచ్చును గాక కామినీ! యీవృథావాసము నీ
  ర్యమున కంగాయము గల్గుచున్నది. నీవేదేని పనియుం
  డవచ్చినచో నరిగింపుము. లేదేని—

రంభ—లేదేని?—

మణి—నన్ను దపముననర్పనిమ్ము.

రంభ—నీతపమునకు నేనేవిధముగనైన విఘ్నకారిణినైతినా?

మణి—(తనలో) దీనిం గాంచినదిమొదలు నేనుతావనజన పిరు
  ద్ధమగు నొకానొక దురూహ్యాభావమునకు బాల్పడినాను
  ఇకముదర నీయగూడదు (ప్రకాశముగా) నీయునికియే
  నాతపస్సునకు భంగకారి.

రంభ—(తలనూపుచు) అటులనా?

మణి—అవును యువతిసంగముచే చెడునుగదా!

రంభ—అయినచో నేనేతెంచిన కార్యముం దెల్పెదను వినుము.

నీయతిలోకమోహన మనింద్యమురూపము గానవారీరిణా
కాయజుతంత్రిపొందతియుగాంచి యనేకదినాలనుండి నే
నాయమ ప్రేమపాశ నశనైకడు నూచ్చుచునుంటి నేటికో
కాయుపయూప ధైర్యము వికావికలైనచన వచ్చిచేరితిణా॥

రక్షణముసేయదలచిన "రమ్మ" నుము, యీ
పేక్షసేయంగదలచిన "వెడలు" నునుము
శిక్షసేయంగదలచిన శీఘ్రమే కృ
పాణధారకు బలియిమ్ము ప్రాణనాథ॥

మణి—కామినీ నాతోడ పరియాచకమా? నేనా నలకూబరుని కెందుబోలగలను?

రంభ—నలకూబరుడే యధికుడుగానిమ్ము. నాకు నీపై గల్గినమక్కువనుదీర్తువా? లేదా? నాకదిదెల్పుడు.

మణి—(తనలో) వ్యవహారము చాలవరకు ముదిరినది. యేమిసేతును? నాచిత్తముగూడ నామత్తకాశిని పొత్తునకే తత్తరపడుచున్నది. మరినానిష్ట నీటగల్పుదునా? గాక నేనేమిజేతును? "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" యనిగదా సూక్తి. అయినను మరొకమారు జెప్పిచూచెదను.

మోక్షముగోరి కాననభూమిజేరి
పరమనైష్ఠికవృత్తి తపంబుసలుపు
చున్న నాబుద్ధిచెడజేసి నన్నునీచ
తర మధోలోకముంజేర్ప ధర్మమగునె?

రంభ—(తనలో) పైకిబింకముగ మాటలాడుచుండునే గాని మనసు, ద్రవీభూతమైనట్లాచూపులే దెల్పుచున్నవి వలచినవానిం గురుతించుట కాంతల కుగ్గుబాలతోబోసిన విద్యగదా! అందును వారకాంతలసంగతి యికజెప్పనేల (ప్రకాశముగా) ప్రత్యక్ష మదనసుందరా!

"మోక్షమోమోక్ష" మనుచును ముక్కుబట్టి
కాఱడవులందు గూర్చున్న గల్గునెట్లు
మోక్షమన నేమిగానెంతు బుద్ధియందు
పారసాత్ముల హీనవిమోక్షమ్మెగాదె॥

(నమీపించి చేయిబట్టుకొని రెండవచేయి భుజమునసుంచును.)

మణి—(స్పర్శసుఖ మభినయించుచు) లసీ.

నవసంఖ్యాకముగా నిగుల్కులనైనంలేవు శ్రీమార్గయా
నవిమానంబది గల్గబోదు మరివిన్నాణంబునై యొప్పుచు
న్న, నసంబాయనిపున్న-యిట్టినులభున్న న్నిప్పుడో కామినీ
గవయంగోరితి నేమిలాభమొ మరుతాంతామణులనవ్వగ॥

రంభ—(పకపకనవ్వి) అదియా నీకుగల సంకోచము అచాటున మరమ్ము వాటినెల్ల నేను జూపించెదను.

(లాగుకొని పోవును.)

రంగము పొదరిల్లు.

(క్రీడాపరాయణులు, రంభా, మణికంధరులు ప్రవేశము.)

మణి—మనోహరీ రోడీ.

రంభ—ఇదియెన్నవది—అతివర్జింపవలెనుగదా!

మణి—అది నాతప్పుగాదు. మణిదర్పణములవలె మిలమిలమె

అయుచు మాటిమాటికి వింతవింత కాంతులీనుచున్న నీనును జెక్కిళ్లనడుగుము.

సరగున బోని మేలిమి వసంతపరాగము దాల్చి స్నిగ్ధతన్
మెఱయుచు పాలు గారు మిసిమిన్ మృదువైన కపోలయుగ్మ మా
చెఱకు రసంబుకన్న గడుఁజక్కని మాధురి జిమ్ముచుండగా
మఱిమఱి ముద్దులాడుటలు మామక దోషము గాదు సుందరీ॥

రంభ——(మరపింపనెంచి) మనోహరా మీరాసెలయేటిదరిని నిన్నటిరోజున నశోకవృక్షమున కల్లుబెట్టిన, నవమాలతీలత నేటికెట్లున్నదో చూడ మఱచితిమిగదా ?

మణి——లేదు ఇట్లేయున్నది.

రంభ——ఎట్లు ?

మణి——నన్నాశ్రయించిన నీవలె.

రంభ——నవ్వులుగాదు ప్రియా.

మణి——కాదు మనోహరీ.

తగినయాశ్రయంబు ధరణిపైలభియింప
గను శోభతోడ గ్రాలుచుండ్రు-
ఘనతరాశ్రయంబునను శోభగాంతురు
బుధులు కామినులును పుష్పలతలు॥

రంభ——అందఱకు గాదనిన వారెవరు.

మణి—మరచితివా ప్రేయసీ యేదీ మద్దు మురిపింపవలెనని నన్నూరించెట్టుచుంటివా? (అని బలవంతముగా పట్టుకొని ముద్దుబెట్టుకొనబోవును.)

రంభ—(బిగ్గరగా) విడు! నలకూబరా! విడు!

మణి—(చివాలున విడిచి లేచి) హా మ్మ విశ్వాసురాలా! (తనలో) నేనెంత ప్రేమరాజ్య పట్టాభిషిక్తనై నర్చినను దీనికి నలకూబరుని పైననేగాని నాపై బూర్ణముగ ప్రేమలేనట్లున్నది. లేనిచో నన్ను బిలువబోయిగూడ వానిపేరేల రావలయును? నేనిదేమాటున కేగి మరల నలకూబరుని రూపమున ప్రత్యక్షమయ్యెదను. కాంత మనసారకోరని పురుషుడా పెను నిర్బంధించిగాంచు సుఖములెక్కలోనిది గాదుగద (నిష్క్రమించును.)

రంభ—(చిన్నబోయి) ఏమిది పొరపాటున నానోట నాల్కకూబరుని నామము వెడలగనే మణికంధరు డలిగిపోయె నాకు నాకు వానిపై నభిలాష దీరనేలేదు. (లేచి) వెదకెదగాక! (పరిక్రమించును.)

మాయా, నల—(ప్రవేశించి) ప్రేయసీ! ఏమిటిట్లు కాంచ...ము గనున్నదానవు?

రంభ—నావచ్చినపని మైనది, (ఉలిక్కిపడి) యికబోదమురండు

మాయా, నల—ఈ ప్రదేశమత్యంత రమణీయముగానున్నది. కావున కొంతకాలమిచ్చటనే క్రీడింతము.

(తెరవాలును.)

---

## చతుర్థాంకము.

రంగము ఉద్యానవనము.

(కలభాషిణి, సరోజిని, ప్రవేశింపుచున్నారు)

సరో—అక్కా! కలభాషిణీ! ఊరడిల్లు మూరడిల్లుము! గడచినదానికై వగచిన యీమాత్రమైన లాభమేమి?

కుందుచుమనస్సు చెడగొట్టుకొనుట యేల!
ప్రాప్తముండిన శుభములబడయరాదె?
గడచిపోయినదానికై కట్ట! యేడ్వ
దగునె? గతజలసేతు బంధనముగాదె?

కల—(దుఃఖగాద్గదిక స్వరంబుతో) చెలీ సరోజినీ—

సరో—కొంచెమూఱటపడి చెప్పుమమ్మా!

కల—నాహృదయాంతర్గతవేదన నీవెట్లు రుంగగలవు? మణికంధరునిమాట తలంపునకు వచ్చినతోడనే నాగుండియు వ్రీలిపోవుచున్నది.

ఏనుగూడ సన్యాసినై యేగుదాన
దేశదేశంబు లెల్లను దిరుగుదాన
నెదకి పాదంబులంబడి వేడుదాన
నొప్పుకొనకున్న మరణంబు నొందుదాన॥

నాచేసిన మహాదురితము హిమాలయ పర్వతమునకన్న మిన్నయైయీపశ్చాత్తాపాగ్ని మాత్రమునదహింపబడక యున్నది. నాకిక వేరుమార్గములేదు సెలవు.

సరో—(అడ్డమువచ్చి పట్టుకొని) అక్కా నీకుభ్రాంతిగా మతిపో యినట్లున్నది. ఇక మీపెద్దలకెరింగించెదను నావలన గాదు.

(తెరలో) నారాయణ—నారాయణ.

కల, సరో—(ఉలిక్కిపడి జూతురు.)

(అంతట మణిస్తంభుడను నొకసిద్ధుడు ప్రవేశించును.)

సిద్ధు—నారాయణ!—నారాయణ!

ఇద్దరు—(నమస్కరింతురు.)

సిద్ధు—అభీష్టసిద్ధి త్వరలోనగుగాక!

కల—మహాత్మా యీవేదికపై గూర్చుండుడు.

సిద్ధు—(కూర్చుండి) కలభాషిణీ! ఎప్పుడుగాని తొందరపడు స్వభావము నీది. అంతటి దుడుకుదనముగూడదు సరో జినీ! నీచెలికత్తెనింత బేలంగానిత్తువేమి?

కల—మహాత్మా తామెవ్వరు ? మాపేరులు మీకెట్లెరుకపడి నవి ?

సిద్ధు—నేనొక సిద్ధుడను. నాకడ దూరదృష్టి దూరశ్రవణము లను రెండు శక్తులుగలవు. వాటిచే ప్రపంచములోని సమస్తము గాంచగలను. లోకములో నెచట నెవ్వరే మాట లాడుకొనుచున్నను వినగలను.

పరో—(ఆశ్చర్యముతో) మహాత్ములకసాధ్యమేమున్నది ?

కల—(ఆశతో) నాప్రియు వృత్తాంతం బీతనివలన నెరిగెదగాక (ప్రకాశముగ) మహానుభావా.

పూర్వజన్మ సుకృత పుణ్యమ్ము నంగాక
వసుధమమ్ము బోటి పాపులకును
గలుగునే ? తపమ్ము గావించినంగాని
భవ్యమైన మీదు పాదసేవ॥

అట్టి మీసేవాభాగ్యము నాకివు డప్రయత్నముగా, నయాచితముగా, లభించినది. నాజన్మ ధన్యమైనది.

సిద్ధు—నీవేదియోనడుగ దలచినట్లులున్నావు

కల—నాస్థితి నించుక తెలియజేయుదు.

సిద్ధు—ఓహో మమ్ము బరీక్షించెదవో ? కానిమ్ము. మొట్ట మొదట నీవొక మనోహరాకారుం బ్రేమించితివి. కొన్ని

దినమ్ములకు వేరొకనిపై నీచి_త్తమును మార్చితివి ?
కడకందుల కిందులకుంజెడిన రేవడిపై తివి మొదటవాడు
నీయీచేష్టకలిగి విరాగియైచనియెను. రెండవవాడు నీకు
దుర్లభుడు—భీకరతరంగిణీ గభీరమధ్యంబున నౌకాద్వయ
మునందు పాదద్వయముంచి బ్రియాణమొసర్పదొర
కొన్న మనుజునిబోలి నీవధఃపతనమొంది దురపిల్లుచున్న
దానవు.

కల—(దీర్ఘముగ నిట్టూర్పుబుచ్చును.)

సిద్ధు—సుకుమారీ ! సత్యమా ?

కల—సత్యము సత్యముదేవా ! ముమ్మాటికిని సత్యము.

సిద్ధు—ఇక నేమడిగెదవు ?

కల—(విచారించి సరోజినిదిక్కై) సఖీ యీమహానుభావునికి
ఫలక్షీరాదులం గొనితెమ్ము.

సరో—(తనలో) మాచెలికిది యున్మాదావస్థయే కడకెట్లు పరి
ణమించునో దురూహ్యముగనున్నది. (ప్రకాశముగ)
అక్కాయిదిగోబోవుచున్నాను త్వరలోవచ్చెదను.

(నిష్క్రమించుచున్నది.)

కల—స్వామీ దేశాంతరగతుడగు నాప్రియు డెందున్నవాడో
తమ దూరదృష్టిచేగాంచి యించుక యెరిగింపుడు.

సిద్ధు—నాతీనీమనస్ఫూర్తిగా బల్కినమాటలేనా. ఇవి లేక నీవాతనిం జూడనెంచితివా ?

కల—స్వామీ! నన్నీయగ్నిపరీక్ష సేలయొనర్తురు ? నాప్రియుని చెంతకేగుటలో మరణమైన సుఖముగా నాహ్వానింతును నామనఃపూర్వకమైన మాటలివి.

సిద్ధు—తథాస్తు! కామినీ అట్లైననిక, నాకాశగమన శక్తిచే మహాప్రమాతిమున నిన్నాతని చెంతకు జేర్చెదను. కన్నుల మూసికొనుము.

కల—(కన్నుల మూసుకొని) స్వామీ! అలసించిన మాచెలి రాగలదు. త్వరగా ననుగ్రహింపుడు.

సిద్ధు—తథాస్తు (కలభాషిణితోగూడ నాకాశమునకెగిరి. నిష్క్రమించును)

రంగము అరణ్యమధ్యమున నొక శక్త్యాలయము.

(ఖిన్నయై నాలోచింపుచు గూర్చున్న కలభాషిణి ప్రవేశించును.)

కల—నాప్రియుని చెంతకు గొనిపోదునన్న సిద్ధుడు అదేలకో నన్నీ కాంతారమధ్యస్థమగు దేవ్యాలయంబునకు దీసికొనివచ్చినాడు. నేనీవిషయమై ప్రశ్నింప "నీదేవిసర్వాభీష్ట ప్రదాయినిగాన నీకొకయుముగా నమస్కరించి పోవుట మంచిదని యిటకుదోడ్కొని వచ్చితి" ననిబ

లుకుచున్నాడు. కాని వీనితీరు యిటకువచ్చినదిమొదలు చాల మాఱిపోయియున్నది. ఈతడేలనో మొదటివలె ప్రశాంతుడుగా గానబడక గంభీరాలోచనా నిమగ్నుడై యున్నాడు. నాయవిమృశ్యకారిత్వము ప్రాణాంతకము గాదుగదా! ఈతడీయరణ్యమధ్యమున నన్నేమిచేసినను నాకుదిక్కెవ్వరు? యుక్తాయుక్త వివేకజ్ఞాన శూన్యులు గదా మోహాంధులు. నాకిప్పుడు కర్తవ్యమేమి? స్నానములకేగిన యాతడువచ్చులోపల నీప్రదేశమునందేమేమి విశేషములుగలవో యారయుదునుగాక (దేవింగాంచి లేచి నమస్కరించు) తల్లీ

అనదనై దిక్కులేక యేకాంతముగను
ఘోరకాననసీమకే జేరవచ్చి
తిని సమస్తాపదలదోఁచి ననుదరింపు
జేయుమా, వందనశతమ్ము సేతుమాత॥

నాకీయరణ్యమున నీవు వినాదిక్కెవ్వరులేరు కొంతదూరమునడచి ఈయాలయమెల్ల జుట్టివచ్చెదగాక (అటుల జేయుచు) ఈప్రాకారకుడ్యముపై నొకశిలాఫలకంబునందేదియో లిఖింపబడియున్నది. (చూచి) అక్షరముల పోల్కి దెలియకుండదానిపై నెవ్వరిచేతనో మృత్తికబూయబడియున్నది. (ఒకపుడకచేగీరి యామట్టినెల్ల పైటచె

గుచే తుడిచి) ఇప్పుడాలోకించుక గాన్పించుచున్నది. చదివెదను.

"సర్వకామదంబన స్వర్గతి వాసినిగాంచి
యున్నట్టి యీ దేవి సన్నిధిగల
గండశస్త్రంబును ఖడ్గంబు శూలంబు
నత్యంతమహిమచే నలరుచుండు
గండశస్త్రంబున కంఠ మర్పించిన
నరునికి ముసలితనంబు రాదు
ఖడ్గముచే బెనవెన్నుల స్పృశించి
నోడనే యొప్పారు మా దృష్టి

చెవిని శూలమ్ము దోపిన నెందుమీర
మందు వినగలశక్తి గుణాఢ్యవధిక
రూపవతివివాహిత నొకర్తె నేపుమీర
దునిమి దేవికి బలియొసంగిన నరునకు
సర్వ భూపాలకత్వంబు సంభవించు"

(చదివి అదిరిపడి) అవురా యీ నీచుడింతులకా నన్ను నా ప్రియుని యొద్దజేర్తునని యాశపెట్టిగొనియిచటికి వచ్చినది? అక్కటా కడకీగోముఖవ్యాఘ్రము నన్ను గబళింప నున్నదా? దైవమా! ఏలనాపై నీకింతకోపము? (దేవి యెదుటకేతెంచి) జగజ్జననీ నారక్తముచే నీపిపాసదీర్చు కొననుంటివా? సర్వమానవ సంరక్షణమొనర్చు నీకునే నొక్కరితను బరువైతినా? వాడు నాశమును పే తప్పించు

కొని బరునెత్తుదమనుకొన్నను యీ కాఱడవిలో నేనెచ
టికేగగలను. ఎచటికేగినను దూరదృష్టియు, దూర
శ్రవణమును వియద్గమనమును గలవాని వానినుండితప్పిం
చుకొని పోవుటెట్లు (తిరిగిచూచి) అదుగో యానీచుడే
తెంచుచున్నాడు. కాగలది కాకమానదు (పాఱజూచి)
యీమారుఖడ్గహస్తుడై యమకింకరునివలె నంతభీకరా
కృతితో వచ్చుచున్నాడా నృశంసుడు—దైవమా! చచ్చి
తిని—చచ్చితిని.

(క్రిందబడి మూర్ఛిల్లును.)

సిద్ధు—(ప్రవేశించి) ఏలయీబాలిక మూర్ఛిల్లినది. విరహభా
రమునగానోపు నాకృత్యములేవెలేచు సరికేముగించి సిద్ధ
మయ్యెదను. నాచిత్తమీపెం గాంచినది మొదలు కుసుమ
శరశరాయత్తమై యుత్తలపడుచున్నది దీనిని దేవికిబలి
యిత్తునా? లేదేని దీనింబత్నిగా గ్రహించి వేరొకబాలి
కనుదెచ్చి బలియిత్తునా? (తలయూపి) యీమాలతీ
లతాంతము కరవాలధారకెరజేయదగినదిగాదు. కాని
దీనినిష్టపడచు కొనుటకైన బెదరించి తీరవలయును.
లేనిచో దేవకుమారదత్తచిత్తయగు నీమత్తకాశిని అంత
తమాత్రమున నాబోటి విరూపులకులోబడునా? (పూజ
రియొసర్చి కత్తిచేబూని బ్రవేశించి లేపుచు) బాలికా!

లెమ్ము ! లెమ్ము ! లేచి నీయిష్టదేవతను స్మరించుకొ
నుము ! నీజన్మము పునీతముగాబోవుచున్నది.

కల ... (లేచి కూరుచుండి) ఇదియేమి ? నీవున్నవుడేమొనర
బోవుచుంటివి ? యీఖడ్గమేల ?

సిద్ధు—(నవ్వుచు) నీవీదేవతామూర్తికి బలిగాబోవుచున్నావు.
యిట్టిభాగ్య మందరికిని లభింపదు.

కల—(అదరిపడి భీతితో) నీచుడా కప్పకూతల పాముచంద
మున తాపసవేషముదాల్చి యేతెంచి నాప్రియునికడ
కేగుదమని నను నమ్మించికొనివచ్చి యిట్టినృశంస కృత్యమొ
నర్తువా ? పాపీ యికనీకు గతులుగలవా ?

సిద్ధు—నాగతుల కేమిగాని నీగతిని యోచించుకొనుము.

పుడమిగల్పింప కారణభూతురాలు
హరిహరబ్రహ్మలనుగన్న యధికురాలు
అట్టి యీదేవదేవికి నెట్టయెదుట
నరుకబడుభాగ్యమెంలటి నాతికబ్బు?

ఇక మాటలాడకుము నీచిత్తమున దేవినిభావింపుము.

కల—(న్యాకులక్రోధములతో) ఓరీ ! మనుష్యరూప పిశాచమా
వేసినది తాపసవేషమా ? సల్పునది ఘోరసకృత్యమా ?
నీసార్వభౌమత్వము దగ్ధముగాను-నన్ను అనాధను అగతి
కను—అబలను—బలియొసంగి తెప్పించుకొనిన సార్వభౌ

మత్త్వముచే నీవేమి బాగుపడనెంచితివి ? నీపిశాచపరిపాల
నచే నేదేశప్రజలరక్తపానముం జేయనెంచితివి ?—బాలి
శా ! నీకొకవేళ యామహాత్మ్యకర్మముచే ప్రభుత్వము
దొరికినను దానిని స్థిరముగా నొక ముహూర్తకాలమైన
నిల్పుకొలజాలుదువా ? తుచ్ఛుడా ! హీనుడా !! పశు
వా!!!

సిద్ధ—(నాలుక కొఱికికొని తనలో) ఈపెయాప్రకటనం జద
వియేయుండును. లేనిచో నావిషయములెల్ల నీబాలిక కెల్ల
దెలియును .(చప్పరించు) తెలిసిననేమి? ముహూర్తమా
త్రములో నీపెనాకుభాగ్యమో బలిపశువో కాగలదు.
యికయెన్ని దెలసి యేమిసేయగలదు ? నామదింగల
కోర్కెనిక దాచకనిప్పుడే వెల్లడించివైచెదను. దానికా
మోదింపకున్నచో ముక్కలకిందజెక్కివైచెదను.—
(ప్రకాశముగ) కలభాషిణీ-పిల్లిశాపములకు ఉట్లుదెగున
నుట కలలోనివార్త. ఉదుకుబోతుదనంబున నీవెన్నిది
ట్టినను నాకొనగోరైన కసుగందదు. కాని నీకుప్రాణము
లపై యాశగలిగియున్న యెడల యీనాభీకరఖడ్గ ముఖం
బునుండి బ్రతికిబైట బడదలచుకొనినయెడల నాయిష్ట
ముచొప్పున నడచుకొనుము . నీకొకచక్కనియుపాయ
ముపదేశింతును. లేనిచో దేవికాహుతియగుటకు సిద్ధప
డియుండుము.

కల—(పలుకకుండ యూరకుండును.)

సిద్ధు—(గంభీరముగా) ఏమి పలాటాడవు? నామాటచొప్పున నడుచుకొనెదవా? నరుకమనెదవా?

కల—(ఊరకుండును.)

సిద్ధు—(నవ్వుచు) మూగనోము పట్టితి—వా—యేమి?

కల—(ముఖము వేరొకవైపునకు ద్రిప్పి) ఏమిటో చెప్పరాదా?

సిద్ధు—(నవ్వుచునే) ఆ! అటులదా లోనికి రమ్ము నీవాశిలాశాసనంగాంచి యూహించినదెల్ల సత్యమే. నేనీదేవియనుగ్రహముచే దూరదర్శన-దూరశ్రవణ—వియద్గమనాది మహిమలనెన్నిటినో బొందియున్నాడను. ఇక నొకచక్కని టక్కులాడిని పెండిలిగాని దానిందెచ్చియిట బలినిచ్చినచో నాకు సార్వభౌమత్వము సంప్రాప్తముగాగలదు అందులకయియే నిన్నుందెచ్చితినిగాని నిన్నుజూచినదాదిగ కుసుమ సుకుమారివగు నిన్నట్లు భీకరకరవాలముపాలొనర్చి చంపుదునాయని నామనస్సు తహతహలాడిపోవుచున్నది. నిన్ను జంప చేతులురాకయున్నవి. కావున నీవు నామాటవిని నన్ను బత్నిగా గ్రహింతువేని నిన్నువిడచి నేను వేరొకనాతిందెచ్చి యీదేవికర్పించెదను. దివ్యసౌందర్య దేహముతో గూడ నేను సార్వభౌముడనయ్యెదను. నీవు సామ్రాజ్ఞివయ్యెదవు—ఏకచ్ఛ

త్రముగా నీలోకమును నీకనుసన్నల మెలగుచు పాలిం
(అర్ధోక్తిలో)

కల—(దేవికి సమస్కరించుచు గొంతెత్తి) తల్లీ! దుష్టజననా
శనీ!!

పరమనీచుండు వీడు నీబాలికవును
పాపబుద్ధిని గామింప బాలుపడెరా
సిగ్గులేకుండ నోరార జెప్పెనిదిగో
భస్మమొనరింపుమమ్మ! యీపాపినిపు...

సిద్ధు—(పరిహాసముగా) తాటాకుల చప్పుళ్లకు కుందేళ్లు బెదరవు
యేల యీవ్యర్థకాలహరణము? ఆలోచించి త్వరగా
నాకేదియో యొక జవాబిమ్ము.

కల—(తనలో) ఈ కామాంధునివలన నాకు ప్రాణభయమిక
లేదనుసంగతి స్పష్టమైనది. ఇక వీనినొకింత తడవాడించి
యేమరుపాటున విడివడు తెఱ వాటియుదును.

సిద్ధు—(ఆవేగముతో) బెల్లముగొట్టినరాతివలె సటుల పలుక
కుందువేమి నాకు ప్రత్యుత్తర మొసగుదువా? చంపనా?

కల—(ముఖమావలికి ద్రిప్పి) నన్ను దేనికని నిర్దేశించిగొనితె
చ్చితివో యాపనిగానిమ్ము. నేను దేవికిబలియగుటకే
నిశ్చయించుకొంటిని.

సిద్ధు—నీవు దేవికి బలియొసంగ బనికిరావు యేలనందువా ?

ఈజగన్మాత కర్పింపనెంచినట్టి
వసువు పరిశుద్ధహృదయ గావలయుసుమ్ము
ఒకనివరియించి మరియు వేరొకనిగాంచి
వలచివిలపించు స్వైరిణుల్ పనికిరారు॥

కావున దేవికర్హమవుగాక మరణించి ఇహాపరములకు రెంటికిం జెడుట తెలివిగల కార్యముగాదు. నా మాటవిని నన్ను జేపట్టి మహారాజ్య విభవంబు జూరగొనుము.

కల—(యేడ్చుచు) నేను జీవించియుండజాలను. నాకు మరణమే వాంఛనీయము. దేవికొఱకుగాకున్న నాకొఱకైనను నన్ను వధించి పుణ్యముగట్టుకొనుము.

సిద్ధు—ఏలమరణింప నెంచెదవు ?

కల—(యేడ్చుచు) నాకీభూమిపై జీవించియుండుటయే దుర్భరముగనున్నది. నీకు నమస్కరింతును నన్ను శీఘ్రముగ నరికవేయుము. నీచేతగానిచో ఆకత్తినొకసారి...

సిద్ధు—(బిగ్గరగా నవ్వుచు) నీచేతికిత్తునియెదవా ? వెఱ్ఱి బాలికా మరణించి యేమిమూటగట్టుకొనఁ జూచెదవు 'జీవన్భద్రాణి పశ్యతి' బ్రతికిసుఖములెన్నో బడయుదువు గాని ఇదిగో ఇక నిన్ను జావనీయను ఈఖడ్గమును దూరముగాబారవైచుచున్నాను. (కత్తినిదూరముగా విసరివైచి) తన్వీ ! ఆహా యేమి నీయదృష్టము ? యీభారతఖండము

నందలి యేబదియారు దేశముల మూర్ధాభిషిక్తుల భార్య
లెల్ల (ఒక్కొక్కయడుగు ముందుకువేయుచు కామవి
కార మభినయించుచు పిచ్చివానివలె) రాజాధిరాజుల
పట్టమహిషులెల్ల నీకూడిగముల నల్పుచుండ—దాసీ
జనపాత్రియలై నీకనుసన్న మెలంగుచు నీకు సేవలొనర్చు
చుండ, ఆహా!—ఆహా! రాజరాజేశ్వరీమూర్తివై

కల—(తనలో) మదనభూతము వీనికిపూర్తిగా నావేశించినది.
హాదైవమా! కడకునన్నింత నీచస్థితికి పాల్పడజేసి
తివి. ఈహీనునిచే నేనిట్టిమాటల పడవలసివచ్చెనే?

సిద్ధు—(సమీపించుచునే విస్మృతితో) ఈసమ్రాట్టు—
యీభరతఖండ సమస్తాధినేత యీ సర్వసర్వంసహా
చక్రవర్తి నీకు దాసానుదాసుడై పాదదాసుడై సపర్య
లసల్పుచు పడిగాపులు పడియుండ.

కల—(ఒక్కొక్కయడుగు దాను వెనుకకునైచుచు దనలో)
దైవమా!

"మొదటనేకోతి, యాపైనిబుద్ధిజెడియె,
కొల్లగా కల్లుద్రావె, తేల్గుట్టె, నిప్పు
ద్రొక్కె, దయ్యమ్ము బట్టె" నన్ చక్కగాఁగ
నున్నది మానవపిశాచ మున్నతీరు॥

వీని నేమిజేసిన నాకు ముక్తి లభింపగలదు?

సిద్ధు—(వికారముగ చిటికెలవైచుచు) నీ యంగుళీవ్యంజనము లకు లక్షోపలక్షలు యోధవీరులు సముద్రతరంగముల వలె ఘూర్ణిల్లుచు నురుకుచుండ, నీకడకంటికెంజాయకు రాజాధిరాజులెల్ల గుండెలు పాళ్ళెా లరచేత బెట్టుకొని వడకుచుండ, యీ సామ్రాజ్యమును శాసింపగల భా గ్యము, ఆ మహాభాగ్యము—(నకిలించి) అ! ఆ!

కల—(బొమలు చిట్లించి) నా భాగ్యము బండలై నల్లియున్నది. నాలుక పిడుచకట్టుకొనిపోవుచున్నది. మున్సెన్ని మంచి నీరొసంగుము. ఆవల సామ్రాజ్యం జేతువుగాని.

సిద్ధు—(పరమానందముతో) దేవిగారి కామాత్ర మనుగ్రహము వచ్చినచో నిక లేనిదేమున్నది? అదుగో నా కమండల ములో నిర్మలోదకము గలదు గ్రహింపుము.

కల—(తల నడ్డముగా ద్రిప్పి) లోకమాతకు పూజార్థముగా గల్పించిన జలముల నెంగిలిపరుపజాలను.

సిద్ధు—అట్లైని యీ సమీపములో నొక సరోవరమున్నది. రమ్ము. అచటికేగి సుధామధురమ్ములగు తజ్జలంబులచే పిపాసాశాంతి యొనర్చుకొని వత్తువుగాని.

కల—(సంతసముతో) సరే! రమ్ము పోదము.

(ఇర్వురు నడచుట నభినయించి సరోవరమును సమీపించి)

కల—ఎంతటి మనోహరముగా నున్నదీ సరోవరము.

సిద్ధు—కమలకువలయాది మనోజ్ఞ కుసుమములచే నిండి రాజ
హంస బకచక్రవాది దివ్యవిహంగమక్రీడాస్థలమై, వృక్షో
ద్యానికుంజద్రుమమండనసంశోభితతీర భూమియై, సర్వదా,
మనకిది ముచ్చట గూర్చుచుండగలదు.

కల—(చిరాకుతో) పాత్రలేక, నేనీ నీరము నెట్లుద్రావుదును
ఆ కానుపించు తామరాకునైన గోసితెమ్ము దొన్నెగా
గుట్టి యుపయోగించుకొనెదగాక.

సిద్ధు—(భయముతో) ఆ కమలపత్రములకడ నీరము చాల
లోతుగ నుండగలదు.

కల—(పరిహాసముగా) భరతఖండ సామ్రాట్టునకుగల ధీరత్వ
మిదియా ?

సిద్ధు—(సగర్వముగా) నేనూరక నట్లంటినిగాని భయపడిగాదు.
యిదుగో నీకన్నులయెదుట నేబోయి యా కమలపత్ర
ము నిట్టె ద్రుంచుకొని వచ్చెదను గాంచుము. (నీటిలో
దిగి యీదును)

కల—(తనలో) నేను పారిపోవ నిదియే సమయము.
(చల్లగా చెట్లచాటునకేగి బరువెత్తుచున్నది.)

సిద్ధు—(తామరాకును కొన్ని పూవులను గోసుకొనివచ్చి)
ఇవిగో (చూచి కలభాషిణి లేమిందెలిసి తత్తరముతో)
కలభాషిణీ! కలభాషిణీ! (అని యెలుగెత్తి పిలచుచు
తడిగుడ్డలతో నటునిటు పరుగెత్తి నిష్క్రమించును.)

కల—(పరుగెత్తి ప్రవేశించి భయముతో) దుర్భరము! దుర్భరము!! పోనుపోను కానన మింత భయంకరమగుచున్న దేమి? ఒక్కపుణ్యాత్ముడైన కంటబడదేమి? అక్కటా!

> శంకరాభరణములు బుసలుబెట్టు
> చున్నఫణంబులు విప్పి చతుపులవెంట
> విసముగ్రక్కుచు గుండియ బ్రిదులునటుల
> నిచట నడయాడుచుండె నే నేమిసేతు?

ఆ పాషండుని చేతబడుటకన్న నీ భుజంగములచేత కరువబడి చచ్చుటయైన మోదావహంబు.

(భీతితో తిరిగిచూచుచు నిష్క్రమించుచు.)

సిద్ధు—(ఆత్రముతో బరువెత్తుచు ప్రవేశించి) ఇంతలో గానబడకుండ నెట కేగియుండును.

> చేతికందిన యట్టి నిక్షేపమును బ
> డంబులం దన్నుకొనినట్టి దైన్యభోలి
> యేడ్చుచుంటినిగద! కాంత యిటుల నన్ను
> మోసముంజేయునని తలపోసినానె?

ఏమి నావెర్రి. మోహము గ్రుడ్డిదనుమాట యిట్టిదే గాబోలు. నాయొద్ద దూరదృష్టి దూరశ్రవణ పభోగము నాది శక్తులున్ననుగూడ వాటిం దలపక యశక్తమాన వునివగిది యిటుల బరువెత్తుచున్నానేమి?

(కనులుమూసుకొని యించుక ధ్యానించి గగనమునకు లేచును)

కల—(కష్టముగాబ్రవేశించి యొకచోట గూలబడి నిట్టూర్చుచు) హాపరమేశ్వరా! కఠినశిలలచేతను కంటకములచేతను నాపాదములెల్ల బదాబద్దలైపోయినవి ప్రాణముబోయి నను ఇంకనేను నడువజాలను. ముందునకొకయడుగైన నిడజాలను. భగవానుడా! నేమిజేయ నుద్దేశించితివో యెరుద నాగమ్ము.

మోహనాంగులకా బ్రహ్మమూఢబుద్ధి
పాదయుగమింత మృదువులై బరగునటుల
నేల సృష్టించెనయ్యయో జాలిలేక,

(ఆకాశమువైపు జూచి యదరిపడి లేచి)

వచ్చుచున్నాడు వాడు నన్బట్టుకొనగ॥

(లేచి పరుగిడబోయి యడుగుబెట్టలేక క్రిందబడును.)

సిద్ధు—(క్రిందికిదిగి సమీపించి) మాయలాడీ! ఇక నేవిధముగా దప్పించుకొని పోగలవు? (పట్టుకొనబోవును.)

కల—(భయముతో నేడ్చును) తండ్రీ! యదునందనా!!

సుకటి చేబూని విసరుచు సుఖమెలర్ప
నప్పుడప్పుడు నీసేవ నాచరించు
దాన, నాపుణ్యమైన రాదాయెబోవ-
వచ్చిపడినాడు వీడు నన్బట్టుకొనగ॥

(గొంతెత్తి బిగ్గరగా) నన్నీ పాపండునిబారినుండి దప్పిం
పగల పుణ్యాత్ములీ సమీపములో నెవ్వరులేరా ?

(తెరలో) ఇదిగో నేను వచ్చుచున్నాను భీతినొందకుము.

సిద్ధు—(భీతితో కలభాషిణిని వదలి పరువెత్తును.)

మాయా, నలకూబరుడు—(ప్రవేశించి) ఎవడవురా నీవు నీచు
డా ! కాంతాజనుమునిట్లు ఘోరకాంతార మాధ్యంబున
కుగొనివచ్చి చెఱబట్టుచున్నాడవు. చచ్చితివిరా పాపీ
(తఱుమును)

కల—(చూచి) ఈతడు నలకూబరునివలె గానవచ్చుచున్నాడు
వీనిం గాంచుటతోడనే నాచిత్తము మరలమిగని కొతు
కల తత్తడివలె క్రొత్తక్రొత్త పోకడలబోవుచున్నది.
నేను దానిని నిరోధింప జాలకున్నదానను వీనింబొందుట
కింతకంటె వాకదను దొరకనేరదు. నారదుడొసగిన
మంత్రప్రభావంబున రంభనై వీని వెంటనేగెదగాక (రం
భరూపొంది) ఇదియొక కాలము. (నవ్వుచు నిష్క్రమిం
చును.)

---

# పంచమాంకము.

రంగము అరణ్యమందలి వృక్షనికుంజము

(మాయా నలకూబరుడు, మాయారంభ, వినోదముగ ముచ్చటలాడుకొను చుందురు.)

మా,రంభ—"అతిసర్వత్ర వర్జయేత్త" నియార్యోక్తి. పరిమితి లేనివారితోడను పగను దయగలవారితోడను వేగుట యనర్థమేయగును.

మా,నల—(నవ్వుచు) నేటినుండి నీయాదేశానుసారమే, నడుచుకొనియెదను.

మా,రంభ—(వినకయే) ఆదుష్టుని యూరకనే వదలివైచివచ్చి నారెందులకు?

మా,నల—ఏమి చేయుమందువు? శరణాగతుడై కాళ్లపై బడిన వాని నేమిచేయుటకును దోచలేదు.

మా,రంభ—అట్టి పాషండుని వదలినచో వాడిట్టికృత్యములే యెల్లపుడొనరించు చుండునుగదా!

మా,నల—(స్మృతి నభినయించి) మరచితి, నాయార్తురాలెట కేగినదో? నీవు జూచితివా?

మా,రంభ—లేదే?

మా,నల—(తత్తరముతో) నేనునీముద్దుమాటలచే మైమఱచి పాపమాకాంతను గూర్చి చింతింపనైతిని మరల వీఁడా మోజిక్కించుకొని బాధపెట్టడు గదా!

మా,రంభ—సహాయమునకు దైవమువలె మీరడ్డుపడినతోడనే బ్రతుకు జీవుడాయని బరువెత్తి యీసరికీయరణ్యము దాటిన్నైన బోయియుందును. లేదేని యేదెనొక యాశ్రయముబొంది సురక్షితయై యుండియుందును.

మా,నల—(మానసముతో నాలోచించుచుండును.

పరివేశము నిజరంభ దూరమునుండి.)

ఎక్కడిదో యార్తనాదమువిని యిదెవస్తునని నన్వీడిరేగిన యార్తత్రాణ పరాయణుడగు నావల్లభుడింకను రాక మసలుచున్నాడేమి ?

ననుగరగించి తానలసి నర్మములాడుచు బూలసెజ్జపై
గనులగమోడ్చి సాత్వికవికారముజెంద, బరుండియుండి మో
మునగలచెమటల్ దుడిచి ముద్దిడబోవగ నార్తనాదము
న్వినియిటు వచ్చివాడుగద! ప్రేమనిధానము గానరాడహో!

ఆతని వెదకుటకై దిరిగితిరిగి కాళ్లరిగిపోయినవి! అయ్యార్తనాద మేమైయుండును. నామనోహరుడెందేగియుండును. దురూహ్యముగానున్నది. (నికుంజమువెనుకనుండివచ్చి యదరిపడి) ఏమిది! యీబూబొదరింటిలో నెవతెనో బెట్టుకొని ముచ్చటలాడుచున్నాడే? యీపెయెవ్వరు ? (పాఱజూచి విభ్రాంతిపడి) ఇంద్రజాలముగాదుగదా! గాదేని యీరంభయెవరు ? "నినుబోలిన రూపముగల వనితయొకతె వీనిగలసి వలపింప" నని యానాడు నారదమహర్షి బలికిన వాక్యమునకిది నాందిగాబోలు నేనిప్పుడేమి చెయొనర్తును ? వీని యెదుటబడి "యిది నీ

రంభగాదు, పిశాచము నేనే నీరంభ" యని చెప్పుదునా ? చెప్పిన నమ్ముదువా ? కానిమ్ము ఈ మాటునదాగియుండి వీరేమి ప్రసంగించుకొనెదరో ముందుగానించుక వినియెదగాక !

మా, రంభ—ప్రియా ! యేమా కాలికంగూర్చి యింతగా నాలోచించెదవు ?

మా, నల—ప్రేయసి ! ఏమనుచుంటివి ?

మా, రంభ—(సానూయము) ఆకాంతకొఱకై మీకింత పరధ్యాన మేలగలిగినది ?

మా, నల—(పరిశ్రుతి స్వగతం) విమర్శించి చూడలేదుగాని ఆకాలిక కలభాషిణివలె గానబడినది.

మా, రంభ—(ఆశ్చర్యముతో) కలభాషిణి యెవ్వరు ?

మా, నల—(పరధ్యానముగా) ద్వారకానగరవాసియగు వేశ్య.

మా, రంభ—(మరింతఆశ్చర్యముతో) మీరామెనెట్లెరుగుదురు ?

మా, నల—(చకితుడై తనలో) నేనునలకూబరుడనను మాటమరచి, మణికంధరునివలె మాటలాడుచున్నాను ఇకమౌనమే శ్రేయము. ఎటుమాటాడినను చిక్కే..

మా, రంభ—(అసూయా క్రోధములతో) త్రిలోకనాథుడగు దేవేంద్రు నంతటివాని యానతినిగూడ లెక్కింపక మిమ్ము నమ్ముకొనియున్న నన్ను - ఈ ముదిరంభను విడచి యీచి

త్రభ్రమరము క్రొత్తక్రొత్త లతాంతములపైకి బరువిడు చున్నది. న్యాయమేసుమా!!

నిజ, రం—(తత్తరముతో సమీపించి) ఎంతటి మాయలమారి జంతవే నీవు? ఇంద్రుని యానతిగూడ లెక్కింపక నల కూబరుని జేరియున్న రంభవా? రాక్షసీ?

మా, నల—(ఆశ్చర్యముతో) ప్రేయసీ! యెవ్వరది నీరూ పము. అచ్చముగా నీ రూపముదాల్చి యిటకేగు దెం చినది?

నిజ, రం—(కోపముతో) అవును. మాయముత్తెమేదో మంచి ముత్తెమేదో గ్రహింపజాలని ప్రియునికడ, నేనవతెనో గాక మరేమగుదును?

మా, రంభ—(తత్తరపడి సమాళించుకొని) ఛండీ!! పిశాచివా రాక్షసివా నీవు? మాయరూపధారీ!

నిజ, రం—(తలయూపుచు) అగునగును అమాయకురాలా! నేను పిశాచిని-రాక్షసిని-భూతమును-ఢాకినిని.

మా, రంభ—(నవ్వుచు) ఇక నీమాటలు మాయొద్దసాగవు. నీ నిజరూపమేదో బైటబెట్టి క్షమాపణగోరుకొనెదవా? తగిన ప్రాయశ్చిత్త మొనర్పవలయునా?

నిజ, రం—ఇంతకువచ్చిన దెంతగాక శాంతించును?

పాపమనబోక నాదు రూపంబుదాల్చి
మాయమాటలచేత నమ్మకము జూపి
నామనోనాథు లోగొని నావసాని
పోల్కి రజ్జులు బేలెదే కుల్కులాడి?

మా, రంభ—(చిరునవ్వు నవ్వి తలయూపుచు) అవురా వగలాడీ!

సిగ్గు విడనాడి వాగెదు చెనటియెవరో?
పనెడి నానాథుడెరుగును వేరె సాక్ష్య
మేల? యీతాంత్రికంబుని కేలనో? ద
య న్నిజం బెరిగింపుమా యబ్జవదన!

మొదట నీవే ప్రయోజనంబర్థించి యీరూపముం దాల్చితివో యేల యిటువచ్చితివో యెరిగింపుము. నానాథుని నేను ప్రార్థించి నీ కిసుమంతయైన శిక్షగలుగకుండ జేసెదను.

నిజ, రం—ఓసి తొత్తుకూతురా! నీకు నిజమెరిగింపవలెనా? (తనలో) మాటలలోనిది నాకు దీసిపోవునటుల లేదు. మార్గాంతరము వెదకెదను (ప్రకాశముగ) నాథా

ఎన్ని దినమ్ములనుండియో
వెన్నెలయుం జంద్రుడట్లు వివిధ సీమలీ
వున్నేను సంచరించితి
మిన్నాతిని బోల్చితివే? మహనీయా!!

మాయా, రం—(నవ్వుచు) అనాథుడే నిజమును గుర్తించుగాక!

ఎవ్వరో నీమనోహారి ? యెవ్వరింద్ర
జాలపుంబొమ్మయో ? చరిత్ర గనుమయ్యా
ధనపతి సుతుండ వఖిలతంత్రజ్ఞుఁ డీవ
యిత్తడింబుత్తడిం గ్రహింపలేవె ?

నాథా ! మాకేల యీవృథాకంఠశోష. సత్యనిర్ణయ మొనర్చు బాధ్యత యిప్పుడు మీపై బడినది. మీరే నిజరంభయెవ్వరో నిర్ణయించుకొనుడు.

గ్రా, నల—(తిచ్చపడి) అపని నాకు సాధ్యముగునట్టుల లేదు. మీవాక్ప్రవాహములలోబడి నామనస్సెటకో గొట్టుకొనిపోయినది. దిగ్భ్రాంతుడను, నేనేమి చేయగలను. మీయిద్దరిలోని, నిజానిజములు మీరే తేల్చుకొనవలయును.

నిజ, రం—(విషాదముతో) నాథా ! పోనిండు. నేనొక గురుతెరిగించెదను. దానిచేనైన నిజరంభ యెవ్వరో గురుతింపుడు.

మా, నల—చెప్పుము చూతము !

నిజ, రం—(సిగ్గుతో) ఇంతకు ముందొకనాగరింటిలో స్వేదస్నాతులమై మనము లలపు దీర్చుకొనువేళ నేను పయ్యెదను సురటిగా నొనర్చి మీకు విసరువేళ, హృదయ విదారకంబగు నార్తనాదము విని

మూ, నల—(పశ్చాత్తాపముతో దనలో) సత్యమెరుగరాకుం డనున్నది. ఈమెవాక్యములు హృదయమునంద్ర వీభూత మొలవర్చుచున్నవి.

నిజ, రం—(భూచియించుక యూశతో) నాథా! ఇదమిత్థమని నిశ్చయించనేరక దిగ్భ్రమజెందియున్న మీయొద్ద నీవి చారణ పూర్తిగాజాలదు. మనము మువ్వురమింద్రలో కమున కేగుదము. దేవేంద్రుని సభామధ్యముననే సత్య రంభయెవ్వరో మాయారంభయెవ్వరో తేటపడుగాక. రండు.

మూ, నల—(సంతోషించి) ఈయుపాయము బాగుగనున్నది. (తనలో) అచటికేగిన నాగుట్టుగూడ బట్టబయలుగాదా!

మూ, రంభ—(తనలో) నాకు ఆసారదునివలన కామరూపక రణమే లభియించినదిగాని యూకాశగమన శక్తిలేదు ఇంద్రలోకమునకుబోవుట కొప్పుకొందునేని నాగుట్టుర ట్టగును కావున, నామాటను తిరస్కరించెదను. (ప్రకా శము.)

తగుదు మనుజునిచట వగకానిముందర
నప్పునట్టి నటన జాలదనుచు
కడకు లజ్జమాలి బుడబుడ దేవేంద్రు
సభకు నెక్కడలతు చాలుచాలు॥

నీకంత కోరికయున్న నీవుబొమ్మమ్మ. ఇట్టి పనికిమాలిన

వ్యవహారములకై నేనా పెద్దలయెదుట బడజాలను నీ
వెంతకైన తగుదువుగనుక నీవేగిరమ్ము.

నిజ, రం—(పకపక నవ్వి) చూచితివా! నాథా! ఆమహామ
హుని సంజ్ఞయైనంతనే గజ్జియలగట్టి నటనమాడు రంభ
కట దేవేంద్రుని యెదుటకేగ నవమానమట. యిపుడు
నిర్ణయించుకొనుడు. సత్యాసత్యములను.

మా, నల—(యోచించి మాయారంభతో) అయిన నీవు దే
వేంద్రుని సమక్షమున సత్యాసత్య నిర్ణయంబొనర్చుకొ
నుటకుగాను రావన్న మాటయేనా?

మా, రంభ—(దీనముగా నేడ్చుచు) నాథా! మీరుకూడ కడ
కావగలాడి మాయమాటలకె మోసపోయితిరా? నన్నిం
తగద్దించి యడుగుచున్నారే?

మా, నల—(చిరాకుతో) నామాటలకు సరియైన జవాబిమ్ము

మా, రంభ—(లేచి) నాప్రాణముపోయినను నేనచటికి రాజా
లను. (వెడలి పోబోవును.)

నిజ, రం—చూచితిరా నాథా యిప్పుడెవ్వరు పిశాచియో ?
ఇంద్రజాలి! నన్నింత బాధించినందుల కిదుగో యీప్రతి
ఫలంబు గ్రహించి మరిపొమ్ము.

త్వరలోన నీకు భీకర
కరవాలముచేత జావుగద్దాదు గాతకా

మా, నల—(రంభ నోరుమూసి) క్షమింపుము. (మాయారం

భద్రికా!) నాతో గుంతకును నీవెవరవో తెలుపకపో
తివి గదా ?

నిజ. రం—(నిష్ఠురముగా) నాథా! దాని నిజనామమునే నేమి ?

సరి నవమిస్సా శమించవగ
వినుగును మకరందము సర్వదేశములందిపిక ॥

(నలకూబరునితో నిష్క్రమించును.)

కల—(పెద్దపెట్టున నేడ్చుచు) నాదౌర్భాగ్యమునకు విసుగుపు
ట్టకుండనున్నది. హా దైవమా.

(మూర్ఛిల్లును.)

---

రంగము అరణ్యమధ్యమందు యొక తరుషండము.

(నిజరంభ మాయానలకూబరుడు, ముచ్చటించుచు ప్రవేశము.)

మా. నల—నన్నాకాంత నిజవృత్తాంతమేదియో తెలుసుకోన
నిచ్చితివిగావు, గద ?

రంభ—ఆమె వృత్తాంతముతో మనకేమిపనిగాని నాథా! యీ
తారుమారెట్లు సంఘటించినది ?

(ప్రవేశము నిజనలకూబరుడు దూరమున)

నిజనల—ఇంద్రునానతిని నిర్వహించుటకు నాప్రేయసికింతకాల
ముపట్టెనా ? ఆబడుగుతపసిని మోసగించుట రంభకుము,
హా! రక్షణమైన బుద్ధిపుట్టదా ? [illegible]

లేమిచేయుచున్నట్లు (భయమభినయించి) లేక యా
మునికఠోర వాక్ప్రహారముచే భ్రమందియుండునా ? తపో
భంగమొనర్ప వచ్చినదన్న కోపముచే నాతడు నాప్రి
యను శాపము పాలొనర్పకున్న బ్రదికినవాడనేయగు
దును. (ముందునకు జూచి) ఇదిగో నాప్రేమైక
నిధానము. కాని వీడెవడు ? (ఆశ్చర్యముతో) అచ్చ
ముగ నన్నే బోలియున్నవాడు, (సమీపించి) తన్వీ !
వీనినెక్కడ సంపాదించితివి?

రంభ—(చూచి యులికిపడి మాయానలకూబరుని బట్టుకొని)
నాథా! నేడేదియో శాంబరమాయ మనల నావహించి
యున్నది.

మా, నల—(చూచియులికిపడి దిటవుదెచ్చుకొని) వీడెవడు ?
నాప్రతిబింబము గాడుగదా ?

నిజ, నల—నీ ప్రతిబింబముగాదు. నీపాలిటి ప్రేతపతిదండము
తుచ్ఛుడా! నన్నుబోలిన రూపమునొందివచ్చి నాప్రియు
రాలి నెన్నిదినములుగా మోసగింపుచుంటివి ? (రంభ
కేలు గ్రహింపవచ్చి) రమ్ము మనకు వీనితోనేమి ?

రంభ—(మాయానలకూబరుని మాటునకేగును.)

మా, నల—(కోపముతో లేచి) పాపీ! నిలుమక్కడ నాప్రి

యురాలి రొమ్ముడలిపై జేయివైచితివివేని నీ మాంసము నక్కలకు వైచెదను జాగ్రత.

నిజ, నల—(వెడనవ్వు నవ్వి) ఏమీ నీవంతటి శూరశిఖామణివి గూడనా ?

రంభ—(విచారముతో దనలో) ఆహా!మునీంద్రుల వాక్యప్రభావము-నారదుని మాటలెల్ల సత్యములై తీరెనవిగదా! అక్కడ వేరొకరంభతో వేగివేగిరాగ నిక్కడ నింకొక నలకూబరుడు బ్రత్యక్షమా ? యీతంత్రముం భేదింప నేదిమార్గము?

మా, నల—(నకిలించి) నాశూరత్వముతో నీకేమిపని! బ్రదుకనిశ్చయించినచో నాబారినుండి దొలగిపొమ్ము.

నిజ, నల—(తనలో) తెలువేది? వీడెవడై న రక్కసుడగునేమో తొందరపడి యుద్ధమునకు దిగినచో నాపైని,యేమగునో దెలియుటయెట్లు? ముందుసామముచేజూచెదను,కానిచో సమరము దప్పనేదప్పదు. (ప్రకాశము) తమ్మీ! నీవైన నన్ను బోల్చుకొనజాలవా ?

రంభ—(తనలో) నాకేమియు దిక్కుదెలియకుండనున్నది. (ప్రకాశముగా) అబలను నేనేమెఱుగ జాలుదును ? ఇదియెల్ల నేమో యింద్రజాలమువలెనున్నది. ఇప్పటివరకు వేరొకరంభతో వేగివేగివచ్చితిని. ఇంతిలో నీవంతదాపురించినది. నాతల దిమ్మెక్కిపోయినది. నేనేమియుచేయజాలను.

నిజ. నల—(తనలో) రెండవ రంభగూడ దారసిల్లినదా? ఏమా శ్చర్యము!

మా నల—(స్మృతి నభినయించి) బోటీ! యిదియెల్ల నలనాటి నారద ఋషీంద్రుని వాక్యప్రభావము.

నిజ, నల—(తనలో) వీనికి నారద శాపముగూడ దెలియును. వీడెవ్వడై యుండును. చెప్పుమా!

రంభ—(తనలో) నారద శాపవృత్తాంతము నానాధుడుగాక యెరుడెరుగడు. కావున నీక్షిత్తగావచ్చినవాడే మా యానలకూబరుడు-సందియములేదు.

మా, నల—(రంభ కేలుగ్రహించి) ప్రియా! మనకీయున్మత్తునితో నేమిపని పోవుదముర మ్ము.

రంభ—(పోబోవును.)

నిజ, నల—(అడ్డము వచ్చి) నిలునిలుము. దుష్టదానవా! అనవసరమగు పోరాటమేలయని జూచుచుండ దిట్టవెమిట్టి పడుచున్నాడవు. రమ్ము ద్వంద యుద్ధముననే మనయిర్వురిసత్యాసత్యములు దేటపడగలవు. రమ్ము—

మా, నల—(రోషముతో) ఏమిరా నీకావగమంతకంతకు మిక్కుటమగుచున్నదే—(సన్నద్ధుడై పోబోవును.)

రంభ—(అడ్డమువచ్చి) నాధా మనకాదుష్టునితోనేమి? నేను మీదాననై యుండగా మనకు వానితోడి యీవృధాకలహమేల?

మా, నల—(పండ్లు గొఱుకుచు) మరివానికూతలాలకించు చుంటివిగద ?

రంభ—నేను మోసపోయి వానిమాటలకు లోబడినప్పుడుగదా మీరంతటి యాగ్రహపడదగినది ?

నిజ, నల—కాంతా! వానిని రానిమ్ము నీవు మోసపోయినది లేనిదియిప్పుడేజూపించెదను.వానిశిరంబును ఈపాదము తో—

మా, నల—(రంభతో) విశ్వసింపుము. నాకడ్డమురాకుము ఈవాచాటుని పీచమడగించి వచ్చెదను. (పిడిపించుకొని మీదికేగును.)

నిజ, నల—(భుజాస్ఫాలనంబొనర్చి) దుర్మతీ!

నేనె నలకూబరుడనేని నీశిరమ్ము
కందుకంబొనరింతు నీక్షణమె గనుము

మా, రూప—(భుజాస్ఫాలనమొనర్చి) పరమనీచాధమా!

అధికమాగవాగు నీయురమ్ము చీల్చి
ప్రేవులందాల్తు తృటిలోన మృగపతిగతి॥

(అనిరోషావేశమున మీదికిదూకును)

నిజ,నల—(రంభతో) లతాంగీ! మాయిరువురను చక్కగాగురుతుపట్టియుందుము. నేను క్రొత్తగా వచ్చినవాడను. అతడు ఇంతకుముందె నీయొద్దనున్నవాడు.

రంభ—(పాఱజూచి) ఇక గురుతింపజాలకపోను.

> నీవుగట్టినపుట్టంబు నీలికాంతి
> గలది, వాతోడమూందుగ గలసియున్న
> యట్టియానలకూబరు కట్టుపుట్ట
> మాకు పచ్చనికాంతిచే నలరుచుండు॥

ఆమాత్రపుగురుతుజాలును. మీరూపములంబోలి వస్త్ర
వర్ణములంగూడ మార్పకున్నచో—

మా, నల—(రూక్షనేత్రుడై) రమ్మానమతలంబునకు వృథా
కాలహరణమేల ?

నిజ, నల—అటులేబోవుదము రమ్ము.

(ఇర్వురు నిష్క్రమింతురు.)

రంభ—(ఆతురతోగాంచుచు) ఆహా! జోడుకోడెలవలె-హర్య
క్షద్వయంబుచాడ్పు-కలభయుగంబుభంగి-తామ్రచూ
డయుగళంబుచందంబున-తగఱులజంటమాడ్కి. ఈన
లకూబరులిద్దరును బాహాబాహి, ముష్టాముష్టి, కేశా
కేశిగా, పోరాడుతీరు,గన, కన,నాహృదయంబున వారా
టముదయింపు చున్నది యిందెవ్వడీమాయానలకూబర
రూపమున వచ్చెనో యించుకంతైన నెరుగరాకున్నయది
యీద్వంద్వసమరమున నానిజనలకూబరున కేదియైన విప
త్తుసంభవించినచో నాగతి యాపైన నేమి కానున్నదో
గదా (పాఱజూచి) చిత్రము! ఇర్వురును జయాపజయ

ములెరుగిరాకరోజూచు సిబ్బవబడినారు. (చూచి) అరుగో ఇచటికే యరుదెంచుచున్నారు. ఇక నేమిసేతును (ఆలోచించి) ఇప్పుడునాకొకయుపాయము స్ఫురించు చున్నది. యోచించిచూడ నంతకంటెమేలగు తెఱవె ద్దియు గోచరించుటలేదు—యీదెబ్బచె సత్యాసత్యనిర్ణ యము జరుగుగాక.

(ఇరువురు నలకూబరులు, సపరివారయానముతో బ్రవేశింతురు)

రంభ—(కౌతుకముతో) ఏమైనది?

నిజ, నల—ఇందుజయాపజయ నిర్ణయముగాలేదు.

రంభ—నాకిప్పుడొక యుపాయము దోచుచున్నది. మీరియిరు వురిని వేరువేరుగా నావలకుగొనిపోయి యొక ప్రశ్నమడి గెదను దానికి సరియగు సమాధానమెవ్వఁడొసగునో వాడు నానిజమగు నలకూబరుడు.

నిజ, నల—అటులేయడుగుము దానందప్పెమి!

మాయా, నల—(అనుమానింపుచు) రహస్యము వినుమిషచే దూరముగ వెంటవచ్చిన నిన్నిరక్కసుడెత్తుకొనిపోయి నచో—

రంభ—(యోచింపుచు) మిగులదూరము బోవనుగదా! (మా యానలకూబరునితో) ముందునీవేరమ్ము. (ఆవలకుగొని పోయి రహస్యముగ) వాణిహిరణ్యగర్భుల ప్రణయకల

అని యానతిచ్చిన నారదబ్రహ్మ సంకల్పమేనుమా?
మాయా, నల—(అన్నట్లై వెడలిపోవుచుండును.)

రంభ—ధూర్తుడా! నీవెవడవో నిజమిప్పుడైన నెరిగించెదవా?

విజ, నల—ప్రేయసీ! వానితోమన కేమి? వాడెవడైననేమి?
పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

---

రంగము-అరణ్యములోని శక్త్యాలయ సమీపము.

(దుర్భరదుఃఖముచే నేడ్చుచు-కలభాషిణి ప్రవేశించును.)

కల—ఇప్పుడెంత యేడ్చి యేమిలాభము?

సద్గుణసాంద్రు నాసత్ప్రియుగాడని
నలకూబరుని బొందదలచినాను
తలచితిబోవాని గలయజాలకయుంట
మించినవగను దపించినాను
అదిగని నామనోహరుడు యాత్రలకేగ
నయులకైకడు గుందినాను
కుందుచు భవనంబు నందయుండక ఘోర
పాపి సిద్ధునివెంట వచ్చినాను

వచ్చిమరణింపనుండ గాపాడవచ్చి
నట్టి యక్షేశసుతు రంభనై గలసియు
సత్యముగురంభయే తేర, జంకులేక
కయ్యముం బెంచి శాపంబుగాంచినాను॥

ఇదియంతయునాపూర్వకర్మఫలముగాకమరేమి (ఏడ్చుచు) ఈ తుచ్ఛజీవితమునింకను భూమిపై సాగింపజాల. ఏదియోరీతిగ నీప్రాణములను విసర్జించినపై చెదను-కాని నా నాకీయంత్యసమయంబున నొక్కసారి నాప్రియుడు-అటులబిలువదగిన యర్హతనుండినేనుపతితురాలనైనను— నా మణికంధరుడు దర్శనంబిచ్చినచో పరమానందముగ మరణింపజాలుదును యీజన్మమునకు నాకట్టిప్రాప్తిగలదా? (గట్టిగా-నిట్టూర్చి) నాకంటికిక నగుపడజాలుదువా? హా! మనోహరా? మణికంధరా (తెరలో) ఇదిగో వచ్చుచున్నాను.

కల—(ఉలికిపడి తిరిగిచూచును.)

(ఖిన్నుడగు మణికంధరుడు ప్రవేశించును)

మణి—(పాఱజూచి) ఇదియేమి? నాప్రియ కలభాషిణింగాంచుచున్నాడను

కల—(చూచికన్నీటితో) నాజన్మతరించినది ఆపరమాత్మకునా యంత్యకాలమునైన నాపై నెనలేని కరుణయుదయించినది (పాదములపై బడి) క్షమింపనర్హురాలనుగాను కావున కనికరమైన నుంపుడని వేడుకొనుచున్నాను

మణి—ప్రేయసీ (లేవనెత్తి) నీవీయటవికెట్లుజేరితివి?

కల—(యేడ్చుచు) నాగోడవ చాలగలదు

మణి— నేనువినదలతును తప్పక చెప్పుము

కల— నీవీయరణ్యమున తిరంబొనరించు చున్నాడవని నాయొద్ద
కొక సిద్ధుడేతెంచి చెప్పి నన్నీయడవికి దోడ్తెచ్చి యీదే
వికి బలియొసంగ నెంచినాడు కానేన్వుచు బరువిడ యక్షే
శపుత్రుడేతెంచి రక్షించినాడు

మణి— (ఆతురముతో) తరువాత తరువాత,

కల— (జంకుచు) తరువాత వానింజూచిన కోడనే నామది
చలించి రంభారూపముంబడసి వానితోడ నేగినాను.

మణి— (భ్రూభంగ మొనర్చి) నీకాశక్తి యెట్లుల గలిగినది?

కల— నారదఋషి యొకమంత్రముపదేశించి యామంత్రమును బ
ఠించుచు నేరూపము గోరినను వచ్చునని వరమిచ్చినాడు.

మణి— యేమాశ్చర్యము—తరువాత?

కల— నిజమగు రంభయేతెంచి నాతో వివాదపడి కడకుసత్యము
వెల్లడిపడనాకు ఘోరశాపమొసగినది.

మణి— తెలిసినది అయిన నిప్పుడేమిచేయుదలచితివి ?

కల— అన్యోపభుక్తమగు యీతనువు నీవు స్పృశింపరానిదని
యెంచి మరణింప సిద్ధమగుచున్నాను.

మణి— (నవ్వుచు) ప్రియా నిన్నుంటిననవాడు నలకూబరుడుగాడు
నేనేసుమా! నాకుగూడ నీయట్టియవస్థయే సంప్రాప్త
మైనది. చెప్పెదనువినుము. ఇచటతప మొనర్చుచున్న

నాకడకు నాతపమ్ము వమ్ముసేయ దేవనాథుడు గంధర్వం
పెను. ఆ పెన్స్వభమబెట్టి తనకు లోబరచుకొనినది గాని
దానిమదిని సలకూబరుడే యధికారమొనర్చుచున్నాడని
గ్రహించి నేను నలకూబరరూపముధరించి దానితో మైత్రి
సల్పుచుంటిని. నడుమసీవే తెంచితివి శాపోపహతవై నీవు
వెడలిపోయినతరువాత నిజమగు నలకూబరుడే తెంచెను.
వానికిని నాకునువిశేషమగు కలహముగూడ బ్రబలెను.
కడకునిజమారసి యావగలాడి నన్నవమానించి వానితో
గూడ నేగినది.

కల—(ఆశ్చర్యముతో విని) తెలిసినది, ఆమనసులోని బెంగదీరి
పోయినది. ఇకనేను నిశ్చలముగ మరణింపగలను.

మణి—అదియేమి నీవుమరణింప నేమావశ్యకము?

(సిద్ధుడు వెనుకపాటునవచ్చి కత్తితో కలభాషిణింగొట్టును.)

కల—ప్రియా—(అని క్రిందబడిపోవును.)

మణి, కం—(అదరిపడిచూచి చిన్నాలునబోయి సిద్ధునిచేతిలోని
ఖడ్గములాగికొని వానింజంపివైచి) పాపీ! దయదలచి
ప్రాణములతో విడిచినందులకా నాకీమేలు సలిపితివి?
(మరణించిన కలభాషిణింగాంచి) హావిధీ! తుదకిటులవ
రిణమించినదా నాజీవయాత్ర? ఇంకను చింతింపనేల—
(కత్తితో తనగుండెలలో బొడుచుకొని మరణించును.)

(ప్రవేశము మనోవేగమున నారదుడు)

నార—(చూచి) ఆహాహా విధివిధానము దాట నెవరితరము. వాత్సల్యమునన్ని చెటకీడ్చుకొనివచ్చినది కలభాషిణి నుణికంధరులారా! పుత్రప్రేమతో జూచుచు గాంధర్వకళ నేర్పి, మీరిద్దరనుకూలదంపతులై సుఖించుచుండ కను లార గాంచుదమని మురియుచున్న నాకు యిట్టిదృశ్య మునా చూపించితిరి?

(శీఘ్రముగా సూత్రధారుడు బ్రవేశించును)

నార—నీవెవడవు?

సూత్ర—సూత్రధారుడను.

నార—నీవిచటికేలవచ్చితివి?

సూత్ర—స్వామీ భరతవాక్యము జెప్పుట కొఱకు.

నార—సర్వనాశనమునకు గూడ భరతవాక్యమా?

సూత్ర—దేనికైననుభరతవాక్యము గావలసినదేగదా దేవా.

నార—భరతవాక్యమో యేదియో యొకటి చెప్పి పొమ్ము.

సూత్ర—తండ్రీ యీసర్వనాశనమునకు కారణ మేమి?

నార—ప్రణయమేగద?

సూత్ర—అవును.

మంగళమగుగావుత, ను
త్తుంగతరంగిత గభీరతోయధిగతి, నను
పొంగగజేయుచు యుపజన
ముంగలచెడు ప్రణయమునకు మ్రొక్కులనిడుదుఙ్‌॥

సంపూర్ణము.

# సాహిత్యలత ప్రచురణములు.

వివేకానంద.

మల్లెపూలు.

వ్యాసమంజరి

ఆంధ్రదేశము

డిటెక్ట్ కెంప్ట్ భాగము.

విజయమంజరి.

కావ్యమాల.

చతుర్థి.

ప్రణయవాహిని.

మంచివాళ్లెవరు ?

అబిసీనియా విధ్వంసము.

మల్లికామాధవము.

ధృవకుమార విజయము.

ఆణిముత్యాలు.

కలభాషిణి.

కర్లపాలెం కృష్ణరావు,
సంపాదకులు సాహిత్యలత,
చీరాల అని జాబువ్రాయవలెను.

శ్రీలక్ష్మీ ముద్రాక్షరశాల, చీరాల.

